# ఇందలి పాత్రలు.

పురుషులు.

వేదవంతుఁడు
శిష్యులు
శివాజీ
నేతాజీ
చంద్రరావు
హిమవంతరావు
బాజీషాహ్రమాజు
అర్చకుఁడు
మాలవీలు
భీమాజి
దుర్గాధ్యక్షుఁడు
తులసీదాసు
సఖారాం
రాంజీ
రుస్తుంజమాన్
సూత్రధారుఁడు
వీరఁడు
వెంకఁడు

స్త్రీలు.

గంగాబాయి
కాశీబాయి
వాణీబాయి
మంజుభాషిణి
వాసంతిక
నటి

ఈ

గ్రంథము

మహారాజరాజశ్రీ

నేరెళ్ల వేంకట

సుబ్బారావుగారి

ద్రవ్యసహాయమున

ముద్రింపఁబడినది.



శ్రీ

శ్రీనివాసో విజయతే.

శా॥ శ్రీనిత్యోత్సుక జాయమాన కరుణా సింధుండు, సంస్తుత్యుఁడై
నానారత్న సుశోభితాభరణ శృంగారుండునై, శ్రీ జగ
చ్ఛ్రేష్ఠ చక్రధరాంకితుండునయి వా సిన్ ద్రౌపదీమానర
క్షానైపుణ్య యశోఘనుండు, యదుకృష్ణస్వామి మిమ్మేలుతన్.

[నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును.]

సూత్ర—ఆర్యారాలా! ఇంకను నీయలంకారము కాలేదా ? సభాస్థారులు నీ యాలస్యమున కోర్వఁజాల కున్నారు. ఇటురమ్ము.

నటి—(ప్రవేశించి) ఆర్యపుత్రా! నే నిట్లు త్వరపడి నారాక నభిలషింపఁదగిన హేతు వెయ్యది?

సూత్ర—ఓసీ! ఇంతయేనా నీవు గ్రహించినది. రామాయణ మంతయు విని రామునకు సీత యేమి కావలయు నన్నట్లున్నది. ఉదయము నుండియుఁ జేయుచున్న యత్నము లెందున కనుకొంటివి?

నటి—మఱచితి. మఱచితి. **కాశీవిజయ** మను నూతన నాటక ప్రదర్శనమంటిరిగదా!

సూత్ర—అవును. అందునకే!

నటి—అయిన నొక కోరికగలదు.

సూత్ర—ఏదీ! అడుగుము.

నటి—గ్రంథకర్తంగూర్చి సవిస్తరముగా వినఁ గుతూహలనైయున్నాను.

సూత్ర—అయిన వినుము.

గీ॥ ఆశ్వలాయన సూత్రుఁడ ♦ త్యమల చరితుఁ
డఖిల సత్కవి మిత్రుండు ♦ నగు సుసర్ల
వంశజుఁడగు సుబ్బాచార్య ♦ వరసుతుండు
రామమూర్తి యీ నాటక ♦ గ్రంథకర్త.

ఇంచుక గురుస్తుతియుఁ జెప్పెద నాలకింపుము.

గీ॥ కవియు నవధానియై పేరుఁ ♦ గన్నవాఁడు
నుభయ భాషాప్రవీణత ♦ నొప్పువాఁడు
నయిన శిష్టాన్వయాబ్ధి నీ ♦ హారకరుఁడు
వరగుణుఁడు హనుమచ్ఛాస్త్రి ♦ వరుఁడు, గురుఁడు.

నటి—కవివరుఁడు మనకు నూతనుని వలె నున్నాఁడు.

సూత్ర—క్రొత్తగనే యుండవలయునని నాకోరిక.

గీ॥ కవియుఁ గ్రొత్తయె, యీ నాట ♦ కమ్ము గ్రొత్త,
యగుట నెల్లర కానంద ♦ మబ్బునంచు
నెంచితిని గాన నీవ యా ♦ డించవలయుఁ
గ్రొత్త బందుగు కూరిమిఁ ♦ గూర్చుఁగాదె.

నటి—క్రొత్తగా నుండుటకు మీరు వచించిన కారణములును జన సమ్మతములే. సభ్యుల కెట్లుండునో గదా! రసికులగు సభాస్తారులే యున్నచో నూతన నాటకములయందు రసగ్రహణ కుతూహాలు లగుదురు. అప్పుడే కృతియు వన్నె కెక్కుట.

సూత్ర—అదియా! నీ సందేహము.

గీ॥ సభ్యులెపుడు గూడను రసా ♦ స్వాదపరులు
వేషధారుల భారంబు ♦ వినుతిఁగొనఁగఁ
బాచకుని యొక్క ధీశక్తి ♦ ప్రౌఢిగాని
తినెడు వారికి రుచులేల ♦ తెలియకుండు.

ఇంకను

గీ॥ దోసఁగు పొసఁగిన చోటనే ♦ యెసఁగు గుణము
చారురసపూర్ణ కవితా ప్ర ♦ శంసలందు

సిందు పున్నమనాఁడు చం ♦ ద్రుండు వెలుఁగఁ
గనఁబడదె కవ్వా, నీహార ♦ కరునియందు.

నటి—ఆర్యపుత్రా! మీ వచనంబులు మిక్కిలి సరసంబులుగను సహేతుకంబులుగ నున్నవి. ఈ వసంతాగమ మెంత సంతోష కరముగా నున్నదో చూచితిరా!

సూత్ర—అయినచో నీ మృదుమధుర గానస్వరంబుచే సభ్యుల నొక్కసారి ప్రశాంతులఁ జేయుము.

నటి—ఇంత ముఖస్తుతి నాకేల?

సీ॥ నవనవస్ఫూర్తి వి ♦ న్నాణంపుఫలములు
రాజితంబగు దీప ♦ రాజిగాఁగ
సముదద్విరేఫాళి ♦ ఝుంకార కృతులు ము
త్తైదువల్ పాడు గీ ♦ తములు గాఁగ
పికశారికాకీర ♦ నికరమంజుల గాన
రావమ్ము వందిప ♦ ఠాకు గాఁగ
నానావిధానూన ♦ సూన వితానంబు
జనులు పైఁజల్లు న ♦ క్షతలు గాఁగ
గీ॥ ధవునెదుర్కొన వనలక్ష్మి ♦ తరలుచుండ
రాజభక్తియుఁ బతిభక్తి ♦ రాణఁదెలుపు
చున్నయది చూడు మీవసం ♦ తోదయంబు
భాసురంబగు మధుమాస ♦ వాసరమున.

సూత్ర—సెబాస్! ఇంతీ! చక్కఁగ వర్ణించితివి. ఇఁక నాలసించి నిన్నిచ్చటనే నిలిపినచోఁ గథాభాగమంతయుఁ బాత్రల ప్రశంస లేకయే వర్ణింతువు గాఁబోలు. సభ్యు లాలస్యమును సహింపఁజాలరు. మనము పోవుదము రమ్ము. నటకులు సిద్ధమై యున్నారు.

నటి—(పాణిగ్రహణ మొనర్చి) చిత్తము. రండు.

(నిష్క్రమింతురు.)

---



శ్రీ

శ్రీశివాజోవిజయతే.

# కాశీవిజయము

## ప్రథమాంకము



### ప్రథమరంగము.

[వేదవంతుఁడు తన యాశ్రమమున విశ్రాంతిగానుండును]

వేద — అబ్బా! ఇప్పటికి నాకు నించుక తీరికగలిఁగినది. శిష్యవత్సలు లెల్లరు నధ్యయనాదులఁ జూచి కొని యెచ్చటికో పోయియుందురు. లేకున్న నాశ్రమమింత నిశ్శబ్దముగా నుండదు. అయినను బిలిచి చూచెదను. (ప్రకాశముగ) ఎవరురా అక్కడ? (నిరుత్తరముగు టచే) అనుకొన్నట్లే యయినది. ఓహో! మరచితి. రేఁపటికి సమిధలు కావలసియుండునని చెప్పితినిగదా! వానిఁ గొనివచ్చుటకు బయలు వెడలి యుందురు. సాధారణముగా నాశ్రమమందు నెవఁడైన నొక్కఁడు తప్పకుండనుండవలసినది. నేఁడెల్లఁరును నొకేసరి బయలు వెడలినందులకు హేతువేమై యుండును? బహుశః ఏదియో నూతనవిషయము వినవచ్చునని తోఁచెడిని. (ఇంచుక యాలోచన నభినయించి) గడచిన రేయి నాకు నిద్రాభంగ మొనర్చిన స్వప్నవృత్తాంతము నాకే విచిత్రముగానున్నది!

ఆవిషయము లన్నియు మనస్సును గలంచు చున్నను గలలోని వార్తలు కల్లలని స్థిరపఱచుకొంద మనుకొన్నచో శాస్త్రసంప్రదాయ ప్రకారము ఫలితము తప్పక సమీపింపవలయును. దీనిని బలపఱచుటకై దైవసహాయము పొసంగినట్లు నేంటి ప్రాతఃకాలమునం గృష్ణాజినంబుపైం గూర్చొనియుండం బైనుండి యెడమ భుజముపై బల్లిపడెను. ఈ బల్లిపాటునకు ఫలము స్త్రీ సాంగత్యమని యే శాస్త్రము నిరూపించుచున్నది. ఇది యేటివెఱ్ఱి! ఇంద్రియనిగ్రహుండనై, ఐహికలోకసుఖదుఃఖవాంఛాదూరుండనై సర్వసంగపరిత్యాగియునైన నాకేల యిట్టి విపరీతములు పొడగట్టవలయును? ఇవియన్నియు

గీ॥ చాలకాలంబు క్రిందట ♦ సన్యసించి
యైహికాలోక సుఖముల ♦ నపనయించి
గహన సంచారినై తపో ♦ మహిమం జెలంగు
ననుం బరీక్షింప దైవ య ♦ త్నంబులేమొ!

ఔరా! కలయును, బల్లిపాటును మనంబునం బెనంగొని చీకాకొనరించుచున్నవి. ఏమి! యీ యధైర్యము? నే వరించిన కన్యకామణి నాకులభింప లేదనిగదా సన్యసించుటకు నాకుం బ్రబలహేతువయినది. అట్టిచో నాకన్యకాన్వేషణంబున లగ్నచిత్తుండనై యున్మత్తునివగిది, నూరనక, పల్లెయనక, చెట్టనక, గుట్టయనక వెదకి, తుదకు వేసారి యిచ్చట నొక యాశ్రమమును నేర్పఱచుకొంటిని. దైవముగూడ నాయెడ నున్నవాఁడై నా పూర్వప్రయత్నంబుల సఫలంబు లొనర్ప నెంచుచున్నాఁడు కాఁబోలు. అయినను నింత యాతురతయేల? రానున్న విశేషములు సావధానముగ విచారింతుగాక. (దిక్కుల పరికించి) ఎవఁడో తీవ్రగామియై పరుగులిడుచు వచ్చుచున్నాఁడు. కారణమేమై యుండును? (శిష్యుఁడు ప్రవేశించి) గురువర్యా! నమస్కారములు.

వేద—సుఖీభవ! వత్సా! నీ వెచ్చటికిఁ బోయియుంటివి?

శిష్యు—మనయాశ్రమ ప్రాగ్భాగమున నున్న చిట్టడివి కేగియుంటిని. (ఆశ్చర్యముగ) దేవా ! ఎన్నఁడును కని విని యెఱుఁగని వింతలీ యాశ్రమ భూముల నేఁడు కన నయ్యెడిగదా.

వేద—వత్సా! నిబ్బరము వహించి యా వింతలెవ్వియో సాంగముగా వచింపుము.

శిష్యు—స్వామీ! మన పుష్కరిణీ పరిసర ప్రదేశంబుల సమిధల నేరుచుఁ గుశలను గోయుచుఁ బ్రకృతిశోభఁ బరికించుచుంటిని. ఇంతలో నేమూలనుండియో స్త్రీ రోదన మొండు కర్ణపుటంబు లవియఁ జేసెను. వెంటనే యా ప్రదేశమున కేగి యొక గుహా ద్వారమున నిలచి యా సతీతిలక మెవ్వరో, యేల విలపించుచుం డెనో యని చాలసేపు పచ్చట నుండి గ్రహించితిని.

వేద—ఆబిడ యేకాకిగనే యుండెనా?

శిష్యు—ఔను! ఒంటిరిగనే యుండెను. కాని యిటునటు తిరిగి చూడక దుఃఖార్ణవంబున మునింగిన దగుటచేఁ గాఁబోలు కన్నీరు మున్నీరుగఁ గార్చుచుండెను.

సీ॥ ఒకసారి దేవతా ♦ నికరంబు నెలుగెత్తి
తనుఁ జేరి రక్షింప ♦ వినుతి సేయు,
నొకమాఱు తస్కర ♦ ప్రకరంబు తన్నుఁ బెం
డ్లాడ యత్నింతురే ♦ యంచు వగచు,
నొకవేళఁ దనవారి ♦ నొకక్షణంబుఁ దలంచి
'ఉస్స'ని నిట్టూర్పు ♦ నొందుఁబుచ్చు
నొక నిమేషమున నై ♦ హికమెల్ల విడనాడి
ఆత్మహత్యయె మేల ♦ టంచునెంచు
గీ॥ వేఱొకప్పుడు తనవారి ♦ విభవమెల్లఁ
దలచి, కన్నట్టి తల్లిదం ♦ డ్రులను గొలిచి
ప్రస్తుత స్థితి కెంతయు ♦ వగచి, విసిగి
యసువులను బాయ సంసిద్ధ ♦ యగుచునుండె.

వేద—పాపము! ఆసతీతిలక మెవరో కనుఁగొంటివా?

శిష్యు—ఆబిడ యించుకైన మనుష్యలోకమున నుండినగదా మన మాటలకుఁ బ్రత్యుత్తరము వచ్చుట. అవయవములకుఁ జలనము లేనిహేతువున నాబిడ బంధితయైనట్లు తోఁచెడి. పాపమీదుస్థితిఁ జూడఁజాలక చేయునదిలేక మీకావార్తఁ దెలియఁజేయఁ బరుగిడి వచ్చితి.

వేద—ఔరా! ఎంతటి ఘోరకలి! పాపము! ఆసతీతిలకమున కిట్టికష్టములఁ గూర్చినవా రెవరైయుందురు? దైవముగూడ నింత నిర్దయుఁడై నిర్జనారణ్యమున బంధితయై నిస్సహాయయగు నీయబలఁ గన్నులఁ గాంచుచుఁ గష్టదశయందున్న నాదుకొన రాకున్నాఁడే!

మ॥ పరదుర్జ్ఞేయ వనప్రదేశముల సంచారంబు గావించి, దు
స్తరవిస్తార పరాపకార ఘటనాసంకల్పులై, లోకభీ
కర దోషాయతశీలురై సుజనులన్ గారించు దుష్టాత్ములం
దరకే దైవము కోపమూనక సహాయం బిచ్చుచున్ వారికిన్.

ఔరా! ఏమి యీప్రకృతివైచిత్ర్యము (విచారముగ) శిష్యవత్సలా! మనమిచ్చట కూర్చొని పశ్చాత్తాపపడిన నేమి ప్రయోజనము?

శిష్యు—గురువరా! అంతకన్న మనమేమి చేయఁగలము?

వేద—ఓరీ! ఆరీతి ననెదవేల? మనమాస్థలమునకుఁబోయి యాబిడ నేల విముక్త నొనర్పరాదు?

శిష్యు—అదియే నా యభిమతము.

వేద—లెమ్ము, వెడలుదము. (నిష్క్రమించు చుందురు)

[రెండవ శిష్యుఁడు ప్రవేశించును]

2వశి—(త్వరలో) గురువరా! గురువరా! అభివందనము.

వేద—నాతోఁ జెప్పకయే నీవెచ్చటి కేగితివి?

2వశి—తప్పు సైరింపుఁడు. ఇచ్చటకొక పరుగు దూరముననున్న వట వృక్షముకడ కేగి యాకులఁ గోయుచుంటిని.

వేద—సరే! ఇప్పటి నీతీవ్రగమనమున కేమిహేతువు?

2వ శి — ఘోర విషయ మొందుచూడగల్గితిని. నేనా చెట్టు పైకెక్కియుండఁ గనుమేరదూరమునఁ గొందఱు ధృఢకాయులు కూర్చొని వికారచేష్టలఁ జేయుచుండిరి. వారిసంభాషణ నంతయు నామూలాగ్రముగ వినఁగోరి మఱింత విపులముగ వినఁబడు నంత దాపునకుఁ జేరితి. ఇంతలో వారి ప్రస్తావన శ్రుతిమించి రాగమునఁ బడినట్లయినది.

సీ॥ నేఁగదా యీకాంత • నెలవు లెచ్చోటనో
కనుఁగొని వచియించి • తనుచు నొకఁడు
నేఁగదా యీయింతి • నేఁటి రాత్రిప్రయాణ
మంచు త్రోవలఁ గాచి • తెంచు నొకఁడు
నేఁగదా యీనాతి • నేర్పుగ మాలోనఁ
గొనివచ్చి నట్టి బం • టనుచు నొకఁడు
నేఁగదా యీబోటి • నిమిష మేమఱకయ
గనిపెట్టు నాయకుఁ • డనుచు నొకఁడు
గీ॥ నేనె లేకున్న దక్కునే • నెలఁత మీకు
ననుచుఁ దమతమ మగటిమి • నంతఁ దలఁచి
యెవనికై వాఁడె యింతి గ్ర • హింప నెంచి
క్రించుదనమూని, కడుఁ గల • హించుచుండ్రి॥

ఇట్లు తమకుఁ దోచిన తెఱంగునఁ బ్రేలుచు నెవ్వతెయో తాము గొనివచ్చిన కన్యకామణికొఱకై తర్కించుకొనుచుండిరి. ఇంతలో వివాదము సంతయు సర్దుకొని వేఁటకై పోదమనుకొని యీటెల నెత్తుకొని పయనమైరి.

వేద — తరువాత నేమాయెను?

2వ. శి॥ — పాపము. ఈ విషయమున మాత్రము దైవము వారికిఁ బ్రతికూలుఁడాయెను. ముందునకుఁ గొంత దూరము నడచి వారిలో ముప్వురు మాత్ర మొకదెస కేగిరి. తదితరు లింకొక వైపునకు నేగిరి.

వేద — అటు పిమ్మట నేమాయెను?

2.వ శి——మొదట పోయిన వారొక బెబ్బులిని వెంటాడుచుఁ దమ సహకారు లున్న దెసకుఁ బోయిరి. వారును విజేస్థితియం దున్న వారై తమ్ము నెదిర్చిన శత్రుండదికి యున్నట్లే ఘోరముగఁ బోరాడు చుండిరి. అంతన నొకరి కొకరు తారు మారులుగ నిచ్చితేని వారగుటచే బెబ్బులులు కొంతసేపునకే నైన వీరల పరదృష్టి వశమ్ముచేఁ బ్రాణాపాయకరమగు విషమస్థితిఁ దరించుటకై శత్రువులపై కుటికి పాతకమార్పి మసఁగిడిపోయినవి. వారెల్లరి కచ్చటనే దిక్కులేని చావు కటుస్థమైనది. ఇది యంతయుఁ దమకు మనవిఁ జేయుఁ దలంచుకొని పరుగిడుచు వచ్చితి.

వేద——ఔరా! కాలచక్రము వివిధగతులఁ మారి పోయినది గదా! ఈ విషయ మంతయు విచారింప వీరెవరో తన్నుకొనుచు చున్నది. వీరి వివాదమునకు బీజకారణమో ఒక కన్యకామణి యట. సరే! ఈ కన్యక యెవ్వరై యుండు ననుటయే ముఖ్యము విచారణీయము. (కొంచెమాలోచించి) ఓహో! ప్రథముఁడు చెప్పిన యువంతమునకు దీనికిని నించుక దగ్గఱ సంబంధమే సూచిత మగుచున్నది. ఆ కుమారుండు బంధితమై వీరిచే నవ హ్నాతమైన కాంతమై యుండవలెను.

ప్రథమ——స్వామీ! మన యచ్చోటికిఁ బోదమనుకొంటిమి గదా! మరల సంక్షేపించు కొంటిరా యేమి?

వేద——ఓరీ! సంక్షేపించు కొనుట యేల? యిరా యిరుపురి వార్తల యందు గల వ్యవహార పరిస్థితుల నాలోచించు చున్నాను. సరే! శిష్యవత్సలులారా! ఇఁక మన మందఱ మచ్చటికిఁ బోవుదము. పాప మా దీనురాలి యవస్థ నించుక చూచి చేనైన సాయము చేసి వచ్చెదము.

ప్రథముఁడు- } స్వామీ! దేవర యాజ్ఞల నేకగ్రీవముగ నెరవేర్చుటకు
ద్వితీయుఁడు- } సంసిద్ధులము.

వేద——ఆశ్రమ సామగ్రిని భద్రపఱచి శీఘ్రముగఁ బయనము గండు.

1, 2 శిష్యులు — అన్నియు నిదివరకే సవిలపముపఁబడినవి.
వేద — సరే. (నిష్క్రమించుచు.)
శిష్యులు — (వేదవంతునితో వెళ్లుదురు.)

(అవనిక జారును.)

---

ప్రథమాంకము.

ద్వితీయ రంగము.

---

(గంగాబాయి బందీకృతయై యేకాంతమున నుండుట)

గంగా — హా రామా! పరంధామా!

శా॥ ధారాళంబుగ నెల్లభక్తులను భద్రశ్రేయముల్గాంచి, నీ
కారుణ్యామృత వీచి కాంబుధిని సౌఖ్యంబందఁ, నీయందయు
న్నారంబున్ వినఁజాలఁగాని, నను దీనన్ స్వాంతేఁ గాపాడఁగన్
భారంబౌనొకొ? నీకుఁగూడ, రఘురామా! దీనమందారమా!

ఇది యేటి వెఱ్ఱి? నాఁబోఁటి దీనురాలిని గాపాడువారును గలరా! "పోరాగింక్షలోని వార్తలు వినవేడుక" యనునట్లు కష్టపడుచున్నఁ జూచి యానందించువారును, సాధ్యమైనచోఁ గష్టాతిరేకము నొనర్చువారును గలరుగాని, యెవ్వరో నూటికి కోటి కొక్కరు పరోపకారపారీణులున్నను నన్నుం బోలు ననాథను గాపాడవలయునని కంకణము గట్టుకొనిన వారెవరుందురు? అయినను వేయుఁగా వేయుఁగా రాయి లక్ష్యమొందకున్నట్లు దైవప్రార్థనఁ జేయఁగా జేయఁగా విముక్తి కలుఁగు నేమో కదా. కానున్నది కాకమానదు. కానేరనిది కానేకాదుగదా. (అని స్థిరమనస్కయై భవానీస్తుతి నొనర్చును.) ఏనాఁటికైన నా మొఱలాలకించి నీవుగాఁ గఱంగఁ జాలని పాషాణహృదయ లీ దేవతులు కాదుగదా!

ఉ॥ దేవి! భవాని! నీవు భవదీయ పదాంబురుహా ద్విరేఫమా
పావన కీర్తిశాలిని వి పత్తులఁ బెట్టక సర్వ సంపదన్

బ్రోవఁగనుందువంచుఁ దల ♦ పోతు, భవత్పదదాసి కష్టమున్
భావనఁజేసి వేగపరి ♦ పాలనఁ జేసినఁ గీర్తి నిల్చెదున్

అయిన నావిచారమిపుడేల? ఆముప్పుదాటినది. తోడేలువాత నుండి తప్పించుకొని, పులివాతఁబడినట్లున్నది. ఈసప్తగ్రహములు రాక పూర్వమే ప్రాణత్యాగ మొనర్చుకొనవలయును. లేనిచో బలాత్కారముగా గాంధర్వ వివాహము జరిగితీరును. వారట్లు సంకల్పసిద్ధులైనట్లున్నారు. మానభంగము కాకుండగల యత్నంబు లేవియును లేవు. ఆత్మహత్యయే పరిహారసూత్రము. హా తలితండ్రులారా! ఎన్నటికైన మిమ్ముఁ గాంచకుందునా యనుకొంటిని. ఆయాశ నిరాశ కావలసినట్లు నేఁటి నాస్థితి రూఢిపరచుచున్నది.

సీ॥ అవమాన మొంది ని ♦ రాధారిణగు ద్రౌప
దికి వస్త్రముల్ ప్రసా ♦ దింపలేదె?
ఎలుగెత్తి నినుఁజీర ♦ నల గజేంద్రునిఁ బ్రోవఁ
బరువడిఁ జక్రంబుఁ ♦ బంపలేదె?
స్థిరభక్తి నినుఁగొల్వ ♦ గురునాజ్ఞ దాటిన
ప్రహ్లాదు నాఁడు కా ♦ పాడలేదె?
తల్లిదండ్రులవీడి ♦ తపసియై నినువేడ
స్వర్గంబు ధ్రువుని పా ♦ ల్పఱుపలేదె?
గీ॥ అట్టి నిష్పక్షపాతి కీ ♦ యదనునందు
నేటికో పుట్టె నాయందు ♦ నీయసూయ,
నన్ను నిఁకనైనఁ గాపాడ ♦ కున్న యెడల
నీ చరిత్రంబు మిధ్యయై ♦ నెగడకున్న॥

నా ప్రార్థనలెల్లఁ జెవిటివాని ముందు శంఖూదినట్లయినది. ఏమి ప్రయోజనము? ఓ పాషాణ శిలావినిర్మితకుడ్యమా! ఇదియే నా ప్రాణత్యాగమునకు సహాయమొసంగుము. వ్రేటునకే శిరస్సు వేయి వ్రక్కలగునట్లు సంకల్పింపుము. (అని తలను గోడను బాదుకొనఁ బోవును.)

(గంగాబాయీ! ఎంతదారుణ కృత్యము! వలదు వలదుఅనుచు మౌని ప్రవేశించును.)

మౌని—పౌరుషశాలినివే యైనచోఁ బ్రాణత్యాగ మేల? ఆదుష్ట సప్త గ్రహంబులం బరిమార్పుము. జననీ జనకుల యశ్రుధారాపరంపరల నాపుము. నిన్నే వివాహమాడఁ ద్రికరణశుద్ధుఁడైన వేదవంతునిఁ బరిణయమాడుము? బాలా! ఏల నీగోల?

గంగా—మునికులవతంసా! మీరెవ్వరో నేనుగుర్తింపఁజాలకున్నాను. పెద్దలయెడ గౌరవముఁ జూపఁ గేలుమోడ్చి నమస్కరింపుటకైన నాకుఁ బ్రాప్తి కలుగఁ లేదు. అవిధేయత క్షమింపకుఁడు.

మౌని—తరుణీమణీ! నిశ్చలభక్తితో మనంబున స్మరించినఁజాలుగాని, కపట నమస్కార సాయకముల నేమిప్రయోజనంబు?

సీ॥ పడతిరో! శృంఖలా ♦ బద్ధఁజేసిన దుష్టు
లెవ్వారలో! వచి ♦ యింపరాదె?

గంగా—కడునిశాత కృపాణ ♦ కలిత తస్కరసప్త
కంబు దీనికి హేతు ♦ కంబులయిరి

మౌని—ఏకారణంబుచే ♦ జేకూర్చి రీశిక్షఁ
గుసుమకోమలి నీకుఁ ♦ గొంకకుండ?

గంగా—ఆ హైన్యసప్తకం ♦ బందు నొక్కనిఁగూడ
నుద్వాహమాడ నే ♦ నొల్లకుంట

మౌని—గీ॥ నింతకే యాత్మహత్యకు ♦ నెంచుటేల?

గంగా—గడవు దినమియ్యదే పెండ్లి ♦ కై మునీశ!

మౌని—ఐన నేమాయె?

గంగా— మాంసంబు ♦ నారగించ
వలయుఁ దప్పక బెండ్లాడ♦వలయు నొకని.

మౌని— కాంతా! తగు ప్రత్యుత్తర మొసంగితివి. వీరిపాల నీవెట్లుపడితివి?

గంగా—అడవిమార్గమున దారిఁదప్పి యొంటరిగ వచ్చుచుంటిని.

మౌని—ఏమీ! ఒంటరిగనా! ఈయరణ్యమధ్యముననా!

గంగా——అహా! ఈతఁ డెవరో కపటసన్యాసివలె నున్నాఁడు. ఇతని కెవరో ప్రభువట! పిలుచునఁట! వెళ్ళునట! ఉద్యోగియా? కూటికి లేని జోగిగాని యుద్యోగియా? ఇతఁడు నిశ్చయమయిన యతియే యైనచోఁ బరకాంత నగు నన్ను తరుణీ! పడతీ! కాంతా! అన్నుల మిన్న! యిత్యాది శృంగార పదంబుల సంబోధించుటేల? కాదు కాదు. ఇతడెవరో దొంగసన్యాసి. నాశత్రు సప్తకము లోనివాఁడు కాఁడు గదా. నాపూర్వచరిత్ర యెట్లు తెలియును? దొంగలవలన గ్రహించి యుండ గూడదా? సొంతముగా నెఱుంగ నెట్లుశక్యము? ఇతని వృత్తియందు సందేహము దోఁచు చున్నది.

ఉ॥ తల్లి! భవాని! ఏలఁ దయఁ • దాల్పవు నాపయి నేల నీగతిఁ
దల్లడిలంగఁ జేతు నిర • తంబు భవత్పద దాసియా ననుఁ
గొల్లగ రాలుగూడఁ గఱ • గుఁ గద దీననుఁ జూచి నీకు రం
జిల్ల దదేలనో? హృదయ • సీమయు రాయియొ? లోహమో గదే?

మ్రొక్కినను వరమీయని దేవతలవలన నేమి ప్రయోజనము? సతికి దైవంబయిన నాపతియే నా యవసాన కాలంబందున నాకుఁ బ్రసన్నుండయి రక్షించుగాత! నాథా! ప్రాణనాథా! నాయత్నంబు లయినవి. నీకు దక్కను. రక్షింపవలయు. నీవే నాకు దిక్కు. హా! ప్రాణేశా!

(అని మూర్ఛిల్లును.)

(వేదవంతుడు ప్రవేశించి బంధముల విప్పి దూరముగా దొలఁగి యుండును.)

గంగా——(మేలుకొని) ఆహా! ఏమియిది? నాసంకెలల నూడదీసిన వా రెవరు? ఏమీ! నేను నిద్రావస్థ నుంటినా? జాగ్రదవస్థ నున్నానా! ఏపుణ్యాత్ముఁడో స్త్రీప్రాణరక్షణ మొనర్చి పుణ్యమున కొడిగట్టు కొని యుండ నోపు. నిశ్చల భక్తియున్నచో భగవంతుఁడు సాయ పడు నందురు. ఇదియే తార్కాణము. అయిన నేమాయె? నాప్రాణ కంటకుని ప్రేలుఁ డింకను వినఁ బడియెడి. ఆకాలిచప్పు డతనిదే కానోపు.

[అవనిక పార్శ్వము నుండి మహారాష్ట్రవేషమున వేదవంతుఁడు ప్రవేశించును.]

మహా—సుందరీ! నీ విందేల నున్నావు? నీ వెవతెవు? నీ పేరెయ్యది?

గంగా—(ఆత్మగతము) వీఁ డెవఁడో మోహాంధకారమున వదరుచున్నాఁడు. (ప్రకాశముగ) నే నెవతెనైన నీకేమి? నా పేరుతో నీకుఁ బని యేమి? వచ్చిన దారినిఁ బొమ్ము.

వేద—ఇంతీ! వచ్చిన దారినిఁ బోవుటకా యింతదూరము ప్రయాస?

గంగా—మఱి యేమి చేయఁదలఁచితివి?

వేద—అనుగుణము. సమాధానముఁ జెప్పెదను.

ఉ॥ కోరిమి నిమ్మదిన్ గలఁకఁ ♦ గోమలి! పెండిలినాఁడె నాదు దే
వేరిగఁ గైకొనంగఁ దల ♦ పెట్టితి, దానికి సమ్మతించి నా
తో రతు మొప్ప రమ్ము తులఁ ♦ దూఁగుదు నా మృదుహంస [తూలికా
గారములందు, సంపదలఁ ♦ గైకొనఁ గష్టమె నీకు మానినీ!

గంగా—తుచ్ఛా! దేవేరిగఁ గైకొనెదవా? దుష్కృత్యులఁ బ్రేలకుము. తొలఁగుము.

వేద—కాంతామణీ! జీవ మెఱుంగని యీ ఛాయాపటంబునుఁ జూచుకొనుచుఁ బట్టరాని పరాళిచేఁ గలకంఠస్వరమాధుర్యము లుట్టిపడ విలపించు టేల? ఇది యొక యరణ్యము. నీ రోదనము లరణ్యరోదనము లగును. విను వారు లేరు. బింబాధరీ! రమ్ము. సుఖముగా మాయూరి కేగుదము.

గంగా—ఛీ! మూర్ఖా! ముట్టకుము. శిరస్సు వేయివ్రక్క లగును.

గీ॥ వర పతివ్రతా మణులనుఁ ♦ జెఱుపనున్న
వాఁడు మృతిజెందుటే నిక్క ♦ వంబు ధరను
మృత్యు వాసన్న మైనచో ♦ వృశ్చికంబు
చూలుఁ దాల్చునటన్న నా ♦ లీల నరయు!

వేద—పతివ్రతవా! కన్యవేయైనచోఁ బతినే వ్రతముగాఁ గొనుట యెట్లగు? నీవు వివాహితవు గావు గదా.

గంగా—కాను. కాని ఎవని నా హృదయ పేటికఁ జిత్రించితినో, యెవని చిత్రపటము నిరంతరముఁ గాంచుచుందునో, యాతఁడే! యా వేదవంతుఁడే నామనోహరుఁడు.

వేద—నిన్ను బలాత్కారముచే నపహరించిన నీపతి యీ నిర్జనారణ్యమున నడ్డుపడునా?

గంగా—ఔరా పాతకీ! ఎంత కార్యమునకుఁ బూనితివి? నీ శూరత్వంబు నబలలగు మా బోంట్లపైఁ జూపుటయేనా? తొలఁగిపొమ్ము. ప్రాణములఁ దక్కించుకొమ్ము.

వేద—తొలఁగిపోక నిన్నెత్తుకపోయినచో,

గంగా—నీ మూర్ఖమే నిన్ను విఱుచుక తినును.

ఉ॥ ఎవ్వని నావిభుండనుచు ♦ నేఁ దలపోయుచు నమ్మియుంటి, నా
కెవ్వని నామతారకమె ♦ యిప్పుడు బంధవిముక్తి నిచ్చెనో
యవ్వర వేదవంతుఁడు ర ♦ యంబునఁ దానిట కేగుదెంచి ని
న్నివ్వన శక్తికిఁ బలిగ ♦ నిచ్చును నాకభయంబు నిచ్చెడున్॥

వేద—నీతులఁ జెప్పుచుంటివి. ఒక్క కోర్కె తీర్పుము. ఆశాభంగముఁ గలిగింపకుము.

గీ॥ స్వాతిముత్తేఁపు చిప్ప వర్ణంబునకయి
యెదురుచూచెడు నబ్బంగి ♦ నిచ్చగించుఁ
గలువ లన నొప్పునట్టి నా ♦ కనుల జంట
పడతి! నీముఖ చంద్ర బిం ♦ బమ్ముఁ గనఁగ॥

గంగా—(స్వగతము) వీని నిటనుండి తోలుటయే ముఖ్యము. ఒక్కసారి తలయెత్తిచూచి పంపివైచెదను. (అనుచుఁ దలయెత్తి) మానసి మానసోద్యాన వనవసంతా! సుకుమారజయంతా! హా! వేదవంతా! నాథా! (అనుచుఁ గాళ్లపైఁబడి) ఎన్నాళ్ళ కెన్నాళ్ళకుఁ జూచితిని!

నా పుణ్యము నేటికిఁగదా ఫలించినది. త్రిమూర్తులారా! మీయుపకృతికి నిదియే వందన శతంబుల నర్పింతు. నావాచాలత క్షమింపుము. నాథా!

వేద — ప్రేయసీ! నిన్నుఁ బరీక్షించుటకై మౌనినై వచ్చి నిజవృత్తాంతము గనుఁగొంటి. కలువకంటియగు నిన్నుఁగంటి. (అని కౌఁగిలించుకొని) రమ్ము. మాపర్ణశాల కేఁగుదము.

(నిష్క్రమింతురు)

ప్రథమాంకము సంపూర్ణము.





# కాశీవిజయము

## ద్వితీయాంకము



### ప్రథమ రంగము.



(రహస్యమందిరమున శివాజీ యోచించుచుండుట)

శివాజీ— కాలము దీర్ఘముగఁ గన్పట్టుచున్నది. నిమిషములు ఘంటలుగఁ దోఁచుచున్నవి. నేతాజీకొరకు వార్తావహునంపియుంటిని గదా! వాఁడును వాయువేగంబునఁ బరుగిడు నశ్వరాజంబు నధిరోహించి ప్రయాణమాయెను. మార్గమున శత్రులెవరైన నాతని ముట్టడించియుందురా? నిరాయుధుండును, నిరపరాధియగు దూతను పౌరుష ప్రధాన శత్రువులు పట్టుకొందురా? ఏదియు నాటంకముండని యెడల నాతఁడేల యింతతడ వాలసించి యుండును? నాకార్యాతురతయే నన్నిట్లు పరితపింపఁజేసెడిని. లేక నేతాజీ వయసు మీఱిన తలిదండ్రులమాటల దాటఁజాలక వచ్చుటకు నభ్యంతరముఁ జెప్పియుండునా? అట్లనుకొనినను ధైర్య సాహసగుణ సమన్వితయై వీరపత్నియను సార్థకనామయు, నాతని యర్థాంగియైనను దేశసేవా వ్రతయై పెనిమిటిఁ బ్రోత్సాహ పరచి పంపకుండునా? యుద్ధసన్నద్ధుండై నాకుఁ గుడిచేయిగనుండు నేతాజీయిట్టి ఘోరసంగ్రామ సమయమున వెనుకంజ వేయునా? ఇస్సీ! ఏమి నావెఱ్ఱి తలంపులు! రణభీముఁ డనఁదగు నేతాజీకిఁ గళంకముఁ దెచ్చుచుంటినే! కార్యావసరమున నించుక నాలసించి యుండు నేమో కదా!

సీ. పాగరెడ్డి కమనకన్ను – పగతురం జెగటార్చి
చేకొనె రాజమాచీ పురంబుఁ
జరుతైన కరవాడ తురక శాసులుఁ బోర
నణఁచి కైకొనియెఁ గల్యాణపురము
నే కారణంబున విప్రుఁడన్న కొంకణ
ప్రాంత దేశంబు నా రాజ్యమయ్యె
దా నాపుగా మధ్య దక్షిణ రాజ్యంబు
నిని మూలాన స్వాధీనమయ్యె

తే. గీ. ఇంతసాయంబుఁ జేసిన యితఁడు నేఁడు
సాయపడ, నేల కూలిన నిస్సంశయము
విప్రుఁడో యికముందో యిటకు రా నేఁడు దెంచు
దైవమా! యాతురత నీవు పొందవలదు.

నామనస్సునకు శాంతిఁజెప్పఁ గొంటిని. దక్షిణాక్షిస్పందనమువలన గార్యసిద్ధియే సూచింపఁబడుచున్నది. (పరికించి) అడుగుల చప్పుడు వినుచున్నాను. అతఁడే కాఁబోలు!

సేవకుడు—దేవా! తమసాన్నిధ్యమునకు వచ్చుటకు నేతాజీగా రనుజ్ఞ వేడుచున్నారు.

శివా—తప్పక రమ్మనుము. త్వరగా గొనిరమ్ము.

(నేతాజీ ప్రవేశము.)

నేతాజీ—(ప్రవేశించి) శ్రీశివాజి మహారాజునకుఁ బ్రణామములు.

శివా—(ఆలింగన మొనర్చుకొని) సుఖాసీనుండవుగమ్ము. నేతాజీ! ఇంత తడవేల నాలసించితివి? కార్యము లెట్లు సాగునటుకొంటివి? నీకొఱకు నాపడిన వేదనాసంశయ మింతింతయనరాదు.

నేతా—దేవా! తమయాజ్ఞల నుల్లంఘింపఁ దలఁచినవాఁడనుగాను. ఆలస్యంబునకు క్షమింపుఁడు. కర్తవ్యమూహింతము.

శివా—వినుము. మాళవీమహావీరులనందఱిని దనయాజ్ఞానువర్తనులుగఁ జేకొనిన మహారాష్ట్రపు హైందవరాజులయం దగ్రగణ్యుండగు చంద్రరావుమురే నెఱుఁగుదువుగదా

నేతా—చిత్రము. అతనికి ముఖ్యపట్టణము జావలిగదా.

శివాజి—అతనికిని బీజపూరువారికిని నన్యోన్యమైత్రి కలదు. చంద్రరావు మనపక్షమును నవలంబింపవలయును.

నేతా—అతనితో మనకనుకూలమే మైనగలదా? అట్లయినచో నవశ్యకర్తవ్యమిదియే.

శివా— ఇప్పటికి దాదాపుగా దక్షిణ ప్రాంత దేశంబు లన్నియు మన స్వాధీనంబు నందున్నవి. భీమా నీరానదీ మధ్యభూములు మనకు లొంగియున్నవి. వీని నెట్లయిన విస్తరింప వలయును. వీనికెల్ల నీ సాయమే ముఖ్యము.

నేతా—ఆజ్ఞాపాలితుఁడనగు నన్నుఁ బొగడవలదు. ప్రభువుల యాజ్ఞల నెరవేర్చుటయు గొప్పయా? అది సేవకా లక్షణము.

శివా—చంద్రరావు మనకు లొంగెనేని బీజపూరువారు దక్షిణమునకు బారి పోవలసి వచ్చును. స్నేహము పొసంగినపిమ్మట నాతఁడు మన మాట నుల్లంఘింపఁడు. బీజపూరును మనకు స్వాధీన పడ గలదు.

నేతా—అతనితో సంధి యెట్లు పొసఁగును? మనమాటల నాతఁడు వినునా? మనకాతనికి మిక్కిలి నూతన పరిచితులము గదా.

శివా—సందేహింపకుము. ఆతనికిఁ గుమార్తెగలదు. ఆమెను నేను వివాహమాడ నిచ్చగింతు. అందున బంధుత్వము గలియును. పిమ్మట ననుకొన్నరీతిఁ గార్యసాఫల్యము నీసమయస్ఫూర్తి వచనంబులపై నాధారపడియున్నది.

నేతా—మీరు చెప్పినదంతయు సయుక్తికముగనే యున్నది.

శివా—దివ్యాభరణాదులఁగూడను గానుకలుగాఁ గొనిపొమ్ము. కార్యభారము నిర్వహింపుము. త్వరపడుము.

నేతా—చిత్తము. భవానీ! కార్య సాఫల్య మొనర్పుము.

గీ॥ జన్మ దేశంబునందు వి ॥ శ్వాసముంచి
ప్రభువు నాజ్ఞను వర్తిమై ॥ యభయమంది

రహి శివాజికి నా చంద్ర ♦ రాయనికిని
సంధిఁ బొసగింతుఁ గార్యంపు ♦ సహాన ముంతు
సెలవొసంగుడు. పోయివచ్చెదను. (నిష్క్రమింతురు.)

---

ద్వితీయాంకము.

ద్వితీయరంగము.

---

(దర్బారు— చంద్రరావు, హిమవంతరావు, బాజీసామ్రాజు) ఆసీనులై యుందురు.)

చంద్ర—హిమవంతరాయా! అమాత్య శేఖరా! మన సభయందలి చర్చనీయాంశము లెవ్వి?

హిమ—ప్రభుపుంగవా! రాజసభయందు చర్చనీయాంశముల కేమి కొదువ? బాజీసామ్రాజు సవిస్తరముగా వచించును.

బాజీ—దేవరా! నేఁడు మన గూఢచారులవలన నూతనాంశంబులు వినవచ్చెడి. అప్పటినుండియు నాహృదయము వీరరసావేశమున నుప్పొంగుచున్నది.

చంద్ర—వీరరసావేశ మనుచున్నావే? మనకు వైరు లెవరున్నట్లు లేదే? ధైర్యమున నెదిరించువారును లేరే. ఎవరితోనైన యుద్ధమునకావమి?

బాజీ—వైరులు లేరని మనమనుకొన్న జాలునా? నల్లనివి నీళ్ళు తెల్లనివి పాలనుకొని మనమెవ్వరిని శత్రుత్వమునఁ జూడము గదా. మన పయిన నెవరికి వైర భావము లుండవను కొనెదరు కాబోలు.

గీ॥ రమణి బరకాంతి వెలిఁగెడు ♦ రాజునకును
గమలముల్ చక్రవాకము ♦ లమరఁ గేతు
వనెడు శత్రువు లుండ న్వ ♦ యంప్రభమెయి
వరలు జేనికి శత్రులో ♦ పమ్ము గలదె

చంద్ర—ఔను. నీజెప్పిన యంశంబులందు నిజమ్ముగలదు. భావమును బట్టిచూడ నాకుఁగూడను వైరు లున్నట్లు సూచించెదవే? నీవెఱింగినచో వారల నెఱింగింపుము. చూచుటచేతనే హితాహిత విచక్షణ చేయుట యసాధ్యముగదా.

బాజీ—మీకు నేనెఱిగింపవలయునా? ఎంతరాజ్యమున్నను సంతృప్తిలేక నెల్లవేళల నింకొకని రాజ్యభ్రష్టుఁ గావించి రాజ్యమును విస్తరింప నెంచు శ్రీశివాజీ చక్రవర్తియే మీకు శత్రువు.

చంద్ర—ఏమీ! నాకతఁడు శత్రువా? తలవని తలంపుగా నున్నదే? అతని కెన్నఁడును వ్యతిరేకముగా నడుచు వాఁడను గానే?

ఉ॥ ఏటికి నాపయిన్ బగ వహించు నతండు నిరంతరంబు పో
రాటమె రాజవర్యుల పరాక్రమ సూచనలంచు నెంచెనో
నేటికి యుద్ధభూమి ననునెగ్గగ నెంచెనో? స్నేహ భావముం
బాటవ మొప్పఁజూపి పరిమూర్ఖుఁగఁజూచెను? కృత్రిమంబునన్

నిష్కారణ వైర బద్ధుండగు వానితో మాటాడ నవసరము లేదు. వచ్చిన రానిమ్ము; యుద్ధమే సిద్ధముగు గాక.

బాజీ—అతని జయింప నెంచినచో మీయాజ్ఞాబద్ధుఁడను నేను. చెప్పినట్లు చేయఁగలను; మనోవాక్కాయ కర్మంబుల దేవరవారి కనుసన్నల మెలంగి శక్తివంచన లేక కార్యమునకు బూనెదను. ఫలాఫలంబులు భవానీదేవి యనుగ్రహము.

చంద్ర—అయినను త్వరపడకుము. రానున్న వానిని నిదానముగా విచారించి యెట్టులేని సామోపాయ ప్రయోగ సాధనమే యూహింప వలయును.

బాజీ—ప్రభుపుంగవా! యోచించుట కేమిగలదు? నేఁటి మధ్యాహ్న కాలమునకు శ్రీశివాజీగారు మన వద్దకు రాయబారి నొకని నంపెద రట. వింటిరా విచిత్రము?

చంద్ర—ఎట్లు? రాయబారి నేటికిబంపును? రాజ్యభారమే కావలయును. గాని యతనికి రాయబారమేటికి? అయినను నిదానింప వలయును.

చంద్ర——ఎదురేగి గౌరవింప నెవరినిఁ బంపిన బాగుండును? యువ రాజుల నిర్వురను బంపుదునా?

బాజీ—— నేనును నట్లేయనుకొంటి. బాగోగుల విచక్షణ మనవసరము. ఇదియే యుక్తము. ఇఁక సెలవు గైకొని పోయెదను.

చంద్ర——సరియే!· కార్యభారమ్మును దీర్పుము.

(నిష్క్రమణము.)

---

ద్వి తీ యాం క ము.

తృ తీ య రం గ ము.

---

[ నేతాజీ పర్వత ప్రాంతంబులఁ గార్యసాఫల్యమునకై చింతించుట]

నేతాజీ——(స్వగతము) నేను రాయబారిగా వచ్చితినా; రాజభోగము లనుభవించుటకు వచ్చితినా? ఈయువరాజు లెల్లపుడు విలాసార్థముగా మాటలాడుచు నేయున్నారు. వలయు భోజన పదార్థములు పుష్కలముగను నాకు సంతృప్తిగను లభించుచున్నవి. కాని, దగ్గర కేగి వారితో నాకు విధింపఁబడిన కార్యభారము మాటాడుటకైనఁ జంద్రరాయని దర్శనము నాకుఁ బ్రాప్తింపలేదుగదా. రేఁపుమాపని కాలహరణ జరుగుచున్నది. విలాసార్థముగా వారాంగనా నృత్యగీతంబుల విని యానందించుటకే నాకుఁ గాలము చాల కున్నది. ఇంటనున్న వానిని శివాజీ చక్రవర్తి పిలిపించి పంపినందులకును నేనిచ్చట సుఖభోగముల నందుచున్నందులకును సరిపోయినది. ఛీ! ఇదియేనా దూత లక్షణము! కార్యవిధానముఁ దలఁపోయకుండుటఁ జూడ నాకేసిగ్గగుచున్నది.

చ॥ త్వరితముతోడఁ గార్యపు వి ♦ ధానముఁ జక్కఁగఁ జేయుమంచునన్
దరిమెశివాజి, యిప్పటికి ♦ దగ్గఱ దగ్గఱ రెండు మాసముల్
సరిగ గతించె కాని నృపు ♦ సన్నిధి నాకు లభింపదయ్యెఁ బై
దరి కేన మబ్బుదయ్యెఁ బరి ♦ తాపకరంబిది నాకు నెంతయున్

శివాజీ చక్రవర్తి నన్నుఁ బిలిపించినపుడే యించుక తడవాలసించినచోఁ గార్యాతురమున నన్నతండు త్వరపెట్టెను. ప్రారంభించిన కార్యభారము మఱియు నాతనికి నుద్రేకముఁ గలిగించును. క్షణమాలస్యమైనను యుగమైనట్లు తలంచును. నేనేమైన నాలస్యమొనర్చితినని కినియునేమోగదా. ఇచ్చట విషయము లాతని కెట్లు తెలియును? ఎన్ని దినములయినను దియ్యని మాటలచే నూరించుచుఁ బర్వతప్రాంతములకు విలాసార్థముగఁ గొంపోవువారును, దురగారోహణంబును, శస్త్రసంధానంబునుఁ జాతుర్యము మెఱయ నుత్సాహముఁ గలిగించువారును, విలాస సంభాషణంబుల నొనర్చువారునే కాని ప్రభువుల దర్శనముఁ బొసఁగఁ జేయువారు గానరైరి. మాటలయందుఁ గార్యభారమును మఱపించి చాకచక్యముఁ గలుంగు వీరికి నెదురాడు వారెవరు? నావచ్చిన కార్యము నిగ్గునో సిగ్గదో యూహింపనలవి గాకున్నది.

మ॥ ధరణీభర్తకుఁ జంద్రరాయునికి వృ ◆ త్తాంతంబు నందించి త
ద్వరవాచాపటు చాకచక్యపు సభి ◆ ప్రాయంబుఁ గొంపోయి నా
చిరకాలప్రభు నా శివాజివిని వి ◆ శ్లేషంబుగా వార్తలన్
ద్వర నందీయఁగలుంగునో? గలుఁగదో ◆ భావింపనాకీతఱిన్

అయినను నింకను దరుణమునకు నిరీక్షించెద.

(తెరలో) నేతాజీ! మహారాష్ట్ర యోధా! మనకొంప కూలినది! ఇంకను నేమి చేయుచున్నావు?

గీ॥ ధైర్య శౌర్యవీరరసప్ర ◆ ధానుఁడయిన
శ్రీ మహారాష్ట్ర వారాశి ◆ సోముఁడయిన
చక్రపాలకుండు శివాజి ◆ చక్రవర్తి
యస్తమింపంగ నింక నేది ◆ యట్టెయుండు?

నేతాజీ—(ఆలకించి) ఇది యేమి కలకలము? ఎవరో శివాజి యస్తమింప ననుచున్నారే? అతని కేమైన ముప్పు ఘటిల్లియుండునా యేమి?

(అర్జునుని ప్రవేశము)

నేతాజీ—(ఎదురేగి) గురుతుల్యా! నమస్కరించుచున్నాను. మా జేసి కేదియో విపత్తు గలిగినట్లు గ్రహింపనయ్యెడి. వివరముగా మీకు దెలిసినంతవరకుఁ జెప్పెదరా? ప్రాణమునైనను ద్యజించియాతనిఁ గాపాడనుంకించెద.

అర్జు—వివరముగా నేను చెప్పుటకుగాని, మీరు వినుటకుగాని యిది తరుణముగాదు. శివాజీచక్రవర్తి పాదఘాటుమీదుగాఁ బ్రయాణమై పోవుచున్న వార్త నెవరో దుష్టులైన శత్రువు లెఱింగి యాతనిఁ జంప నుద్యుక్తులై యేగిరి. సమీపమార్గమున మనమేగి యాతనిఁ గలిసికొందము.

నేతాజీ—(ఆశ్చర్యముతో) ఎట్లా! శాత్రవవర్గమతని నెదుర్కొని తను మాపుట యబద్ధము. ఆతని చేతనే వీరు హతులగుట నిశ్చయము. గురువరా! మీరుగూడ రండు. త్వరితముగ నేగి రాజుగారి ప్రాణరక్షణ మొనర్తుము. రండు.

అర్జు—అట్లే. రమ్ము.

(నిష్క్రమింతురు)

(తెరవ్రాలును)

---

రంగము:—అరణ్యమునందు మాలవీనాయకులతో బాజీ షామ్రాజు ప్రస్తావించుచుండును.

బాజీ—మాలవీనాయకులారా! మీరందఱు నాకు నేవిషయమున సహాయకారులగుటకు నిటను విచ్చేసితిరో తెలియునుగదా. కను మేర దూరమున నదిగో! ఆ వచ్చువాఁడే శివాజి. ఆతఁడే మనకు శత్రువు. ఆతనినే నేడు పరిమార్పవలయును. ఈ కార్యమున మీ సహాయము దైవసహాయముకన్న హెచ్చుగా నుండవలయును. ఇందున జయశీలురమైతిమేని మీకుఁ జంద్రరాయని వలన గొప్ప విందు నలుపఁబడును. ఆతఁడు జయపతాకమును స్థాపించి మీకు

బహుమానములిచ్చెదను. నేను తుపాకినిఁ బ్రేల్చెదను. వెంటనే మీరెల్లరు నేకకాలమునందే శరపరంపరల సంధానించి బాణ వర్షము వానిపైఁ గురిపింపవలయును. తుపకెట్లయినను వాని మైదీసుఁ గొంపోవుదము. ఎట్లు తప్పించుకొన భుజపరాక్రమము జూపునో చూతము. మీరు మాత్రము మిక్కిలి జాగ్రత్త గలిగి ప్రవర్తింపవలయు. భవిష్యదభివృద్ధి మీకుండదలచినను నీ కార్యమందలి జయాపజయములపై నాధారపడియుండును. వెన్న మీ చేతిలో నుంచితిని. వశ్యముఁ జేసికొనుభారము మీది. పైన మీ యిష్టము. ఎల్లరును త్రికరణ శుద్ధిగా నేకీభవింపవలయును. తరుణము వేచు కొనుఁడు. కాలయాపనముఁ జేయకుఁడు. అదిగో దగ్గర దగ్గరకు వచ్చుచున్నాఁడు. ఇంతకు మించి మీకుఁ జెప్పవలసిన యంశము లేవియు లేవు. హుషారు! హుషారు! (అనుచున్నంతలో బాణము వెనుకనుండి తగులును. బాజీప్రభూజు మూర్ఛిల్లును)

మావలీనాయకుఁడొకఁడు—

“చాలకపురా చెడెదవని” నట్లు వీని కుట్రాలోచనకు దగిన శిక్షఁ బొందినాఁడు. నిష్కారణముగాఁ జంప నుంకించినందునగదా యీ దిక్కులేని చావు తటస్థించినది. ఎవఁడెట్లైననేమి? మా శివాజీ ఛత్రపతి రక్షింపఁబడెను. ధర్మమేల జయింపకుండును?

[శివాజీ, నేతాజీ, అర్జునుఁడు ప్రవేశింతురు.]

మావలీలు—(ఏకగ్రీవముగ) శ్రీ శివాజీమహారాజ్‌కు జేస్!

(అనుచు కేకల వేయుదురు.)

శివా—మీరెల్లరు నెవరు? ఇచ్చటి కేల వచ్చితిరి?

మావలీనాయకుఁడు—దేవా! మహారాజా! మేము మావలీలము. వీరి కెల్లరికిని నేను నాయకుఁడను.

శివా—(పడియున్న బాజీనిఁ జూచి) ఈ కళేబర మెవరిది?

నాయకుఁడు—ఇతఁడు బాజీప్రభూజు. చంద్రరాయుని తరఫున మిమ్ములఁ జంప మమ్ములఁ బురికొల్పి, మా త్రికరణశుద్ధికి వ్యతిరిక్తముగా

నిటకు దాను మాతో విచ్చేసెను. దైవవశంబున బరోక్షమందుండి వచ్చిన బాణముచే నీతఁడు హతుఁడయ్యె.

శివాజీ— నేతాజీ! చూచితివా! ఎంతటి కార్యము జరుగనుండెనో! నీవు గూడ నిచ్చటికేల వచ్చితివి?

నేతాజీ— దేవా! ఈయర్చకుని మూలమున నీవిషయ మెఱింగితి.

(శివాజీ, నేతాజీ అర్చకునకు నమస్కరింతురు.)

అయ్యా! తమసాయంబు లేకున్నచో వీరి చేతులఁ బడియుందు గదా! ప్రాణరక్షణబుణమునుఁ దీర్పఁజాలను క్షమింపవలె. మీరు మాత్ర మీవిషయమెట్లెఱింగితిరో వినఁ గుతూహలుఁడను.

అర్చ— మహారాజా! మేము (శ్రీ) శివాజీతో సఖ్యమొనర్చు కొనుమని మేము చంద్రరాయనిఁ బురికొల్పుచుండెడివారము. అట్టియెడ శా జీషాద్రమాజు మాయందుఁ గ్రోధమానసుఁడై యుండ నిదియంతయుఁ జక్కఁగా నెఱింగి, యాతఁడు మాయం దసూయఁ గలవాఁడనియు, మాప్రయత్నముల భంగమొనర్చు ననియు నొకకంటఁ గనిపెట్టి యుందుము. సంధివిషయమున నితఁడు మిమ్ములఁగూర్చి దుర్బోధల నొనర్చి తనవైపునకుఁ ద్రిప్పుకొనువాఁడు. ఇట్లుండ నీతఁడు మాలవీ నాయకునితో రహస్యప్రసంగముఁ జేయుచుండగా మాకు సందే హముఁ గలిఁగెను. మఱునాఁడు దేవీపూజకై మాలవీనాయకుఁడు రాఁగ నీకుట్ర నెఱుంగ నిచ్ఛకలింగి, నేనొక పన్నుగడఁ బన్నితిని. నాపై దేవి పూనినట్లు నటించి, రోషకషాయిత నేత్రుండనై, భీకర ఘీంకార రావంబుల బెదరించి, చండికాకృతినిఁ దాల్చి, నిజముఁ దెల్పుమని కోరితిని. అందువలన మాలవీనాయకుండు వెఱగంది ప్రత్యక్షముగ నామూలాగ్రముగ దేవీ సాన్నిధ్యమున వచించెను. ఇదియే నేఁజేసిన స్వల్పకార్యము.

శివాజీ— ఔరా! అర్చా! ఎంతటి సమయస్ఫూర్తి మెలంగితివి నేతాజీ! నీవును నాకుఁ బ్రాణదాత వయితివి. ఈ విషయముల వెలిఁబెట్టక కార్యసాధన మొనర్చుకొని రమ్ము. నేను వెడలెదను.

నేతాజీ—నేనును మీవద్దనుండు నట్లొనర్చినఁ గృతజ్ఞుఁడను.

శివాజీ—కొలఁది కాలములోఁ బిలిపించెదను. అంతవరకుఁ గార్యాలోచన మొనర్చుచుందుము. యుద్ధమీ సమయమునఁ దగదు. పగ దీర్పక మానను.

నేతా—దుష్టులమధ్యనుండిఁ దప్పింపవలయునని యే యీదీనుని ప్రార్థన.

శివా—అట్లే యగునుగాక.

నేతా—చిత్తము వెడలెదను.

(అందరు నిష్క్రమింతురు.)

తెర వాలును.





# కాశీవిజయము

## తృతీయాంకము.



### ప్రథమరంగము.

కాశీ—(స్వగతము) దైవజ్ఞులారా! త్రికాలవేదులారా! మీమనువుల లన్నియుఁ దూ, చా, తప్పక యథార్థములు నేఁటికి గదా యాయె నని తెలిసికొంటిని. హా నాథా! మఱలవత్తునని చెప్పి నారాఢ్యులఁ బలికి పయనమైతివిగా! నేఁడేమైతివి? నాథుఁడు లేని యనాథ పోల్కి నీహయరాజము 'ఆబూజా' నిన్నెట్లువదలివచ్చెను? దానిని నీవెట్లు వదలితివి? ద్వారమువద్దకు వచ్చినది మొదలు నన్నుఁ దనపై నధి రోహింప నన్నలనొనర్చుచు ముందునకు దారి తీయుచున్నది. నీకే మైనముప్పు వాటిల్లినదా? ఛీ! నే నెంత వెఱ్ఱిని! ముప్పువాటిల్లి యున్నచో నీహయరాజమేల ననాథపోల్కి నుండు? ఎట్లు గలసి కొందునో యెఱుంగను. దైవమా! నీవైన నాకాంతుని మఱపుఁ బాపి నాతోఁ జేర్పఁ జూడుము. లేక నాకైన నాతనిఁ గలసికొను భాగ్యముఁ బ్రసాదింపుము. మనుష్యప్రయత్నమునమాత్ర మాతని సమాగమము దుర్ఘటమని తోఁచెడిని. నాథా! దినదినము నీపద సరసీరుహంబులనే యాధారముగా భజించుచున్న నన్నెట్లెడఁ బాసితివి? నీవెచ్చటనున్నావోగదా! హా! మనోహరా! ఏరీతి మఱలఁ గలియుదును? మాటాడఁ

జాలదుగాని నీహాయరాజభావముల గ్రహింపలేకున్నాను. ఏమని గ్రహింతు? నన్ను తన ముఖమున స్పృశించుట ముందునకు నడచుటయే గానవచ్చుచున్నదే! హా! పరంధామా! నీవే నామనో హారుని(గూర్ప సాయ పడవలయును. దేవీ! భవానీ! నీపాదములే నమ్మినాను.

సీ॥ హేమదుర్గా! నాదు ♦ కామ సుందరు(గాంచ(
గలిగిన నిన్ను(బు ♦ వ్వులను(గొలుతు
నో హిమాత్మజ నామ ♦ నోహరు దర్శన
ప్రాప్తినించిన నీకు( ♦ బ్రణతులిడుదు
నో చండికా నన్ను ♦ నేచక విభుతోడ(
జేర్పగల్గిన నీకు( ♦ జీరలిత్తు
నోశంభురాణి ప్రా ♦ ణేశు(బ్రోచితివేని
పొడికుంకుమను దెచ్చి ♦ పూజసేతు
గీ॥ హేమహేశ్వరి కాత్యాయ ♦ నీ మదీయ
పతియె నీచేత రక్షింప( ♦ బడినయెడల
సకల వికచ ప్రసూనపూ ♦ జావిధాన
ములను దనియింతు నినునెంతు ♦ మ్రొక్క(గొంతు

తల్లీ! దేవీ! నిన్ను వేడుకొనుట తప్ప నితఃపర మెఱుంగను. ఎట్లయిన ననాథ రక్షించు భారము వహింప వలయును. అఖండ భూమండలంబు నెల్ల శిక్షింప రక్షింప సమకట్టిన నీవంటి జగన్మాతకు నన్ను రక్షించుటది భారముగా( దో(చదని నాయభిప్రాయము. అయినను మనుష్యప్రయత్న ముండవలయును గదా! మాఅత్త మామలగు వాణీబాయియు భీమాజియు నేమని సెలవో సంకుదురోగదా? వారును నిదే దెస వచ్చునట్లున్నది. రానిమ్ము విచారింతును.

ప్రవేశము:—వాణీబాయి, భీమాజీ

కాశీ—పూజనీయులగు నత్తమామలకిదియే యభివందనము లాచరించుచున్న దానను.

భీమా—(వాణీబాయి వంకకు దిరిగి) కాంతా! నేఁడేటికో మన కాశీబాయి ముఖవికాసము తగ్గినట్లున్నది. కారణమేమై యుండునోపు?

వాణీ—నాథా నేనుమాత్ర మేమి యెఱుంగుదును? అయినను కనుఁ గొనియెద. (కాశీబాయి వంకకుఁదిరిగి) అమ్మాయీ! కాశీ! నేఁడేటికి నిష్కారణముగాఁ గన్నీరొలికించుచున్న దానవు? ముఖము కళాహీనమై యున్న దేల? కారణములు చెప్పకున్న నీ మనోగతము మాకెట్లు తెలియును?

కాశీ—అత్తమామలారా! నేనేమని వచింతు? నేఁటి ప్రాతఃకాలమందున నురుగులు గ్రక్కుచు మన యాబూజా తనగిట్టలచేఁ దలుపు గీరుచు ద్వారమువద్ద నిలువంబడియుండెను. నేను లోనుండి యా శబ్దము నాలకించి కవాటంబుఁదెఱచితి. అంతట నన్నా యశ్వరాజము గాంచి చేసిన చెయ్దము లేమని విన్నవింతు.

ఉ॥ గిట్టలతోడఁ గాలిచయిఁ ♦ గీరును, వెంటనె రాజమార్గమున్
బట్టును బర్వులెత్తుఁదన ♦ పై ననుఁ గాంచమి యాతురమ్ముగన్
నెట్టన వెన్కకుం మరలు ♦ నిల్చివిషాదము సూపు నేలపై
గిట్టలతోడ వ్రాయుఁ బరి ♦ కింపఁగ రావిఁక దానిభావముల్

వాణీ—ఈవిషయంబుల నాలకింప నందు గూఢమగు భావగాంభీర్యమున్నట్లున్నది. మన యాబూజాభావము నీ వేమని తలంతువు?

కాశీ—ఇఁక గ్రహించుట కేమియున్నది? ఆశ్వారూఢుండై సాగిపోయిన మీసుతుఁడు లేక యొంటరిగ నీ యశ్వరాజము వచ్చిసలువఁ బడియుండుటచే మీకుమారున కేదియో విపత్తు ఘటిల్లి యుండనోపు. ఇంతకన్న నూహింప వలసిన విశేషాంశ మేమున్నది?

వాణీ—(విషాదమున భీమాజీ నుద్దేశించి)

నాథా! నేఁడెట్టి దుర్దినమోకదా! మనయనుంగు పట్టియు నేక పుత్రుండును దిరిగి రాఁడాయెగదా! నేఁడెట్టిస్థితియుందున్నాఁడో కదా! ఎవ్వరైన వైరిరాజులాతని ముట్టడించియుందురేమో? నాథా ఇఁక నేదిదిక్కు!

భీమా — కాంతా! ఊరడిలుము. నిదానమునఁ గార్యములు సఫలము లగును. ధైర్యముఁజిక్కఁబట్టక బేలవై విలపించిన నేమి లాభము? ఆదైవమే మనకుఁదోడగుగాత! జగద్విఖ్యాతకీర్తి కాముండగు శూరశిఖామణియగు కుమారునకు నపజయముఁ గలుగఁబోదు. అయినను విధివశము దప్పింప నేరితరము?

గీ॥ అతుల సౌభాగ్యకలిత రా ♦ జాత్మజుండు
నైన రఘురాముఁడే మున్ను ♦ కాన కేగె
నతనికుసతియును ననుజుండు ♦ వెనుక నరుగ
నట్టిచో విధిఁదాటంగ ♦ నగునె మనకు

వాణీ — నాథా! ఉపమానములకేమి? ఎంతయో విరాగులకేగాని ఐహిక సుఖంబులయందుగాని తత్సంబంధ బంధుత్వ పాశంబుల యందుగాని వైరాగ్యము పొడమదు. ఎట్లయినను గన్నకుమారు నిపైఁ దల్లికిఁదప్పకఁ బ్రేమయుండక తీరునా?

సీ॥ ఏ ద్యొక్కసినిఁ జూచి ♦ యెట్టి కష్టములైన
సులభసాధ్యములంచుఁ ♦ దలఁచియుంటి;
నేయనుంగు కుమారు ♦ నీక్షించి యూతఁడే
యోడ్డడ యానంచు ♦ నెంచియుంటి;
నే సుపుత్రుఁడు వన్నె ♦ వాసిఁ గూర్చునటంచు
మితిమీఱు నాసఁ బ్రే ♦ మించి యుంటి?
నే కుమారుని చేత ♦ నిన్ని తిలోదకం
బులఁ గాంచ వచ్చునం ♦ చలరుచుంటి;
గీ॥ నెవనిఁ గని పుత్రికాశోక ♦ మెల్లమింగి
మనమునకు శాంతిఁ జెప్పి నే ♦ మనుచునుంటి
నట్టి సుచరిత్రు, వరగాత్రు ♦ నేకపుత్రుఁ
గన్న కడుపీఁగతిని నేఁడు ♦ గడ్డలయ్యె!
హా! కుమారా! ఏకపుత్రా! నేతాజీ! (మూర్ఛిల్లును)

భీమా — కాంతా! ఇట్టి వంతల నిన్నెట్లోదార్పఁగలను? నాకును బుత్రవియోగముచేఁ జిత్తము తత్తరపడుచున్నది.

కాశీ—అత్తమామలారా! మీరిట్లు చింతించిన నేమిలాభము? నాకనుజ్ఞ యొసంగుఁడు. నా ప్రాణేశ్వరుని సంరక్షణార్థము నే పోయెదను. సురక్షితముగా మీ కొమారుని వెంట నిడుకొని మిమ్ముల దర్శింతు.

వాణీ—(మేల్కాంచి)అమ్మా! కాశీ! దుర్ఘట కార్యభారము నెట్లు సహింతువు? ఘోర విపినంబుల సింహశరభ శార్దూలాది క్రూర మృగభయంకరారావములు దిక్కులఁ బిక్కటిల్లఁ జేయుచుండ నిర్హేతుకజాయమాన క్రోధావేశావశతఁ బాంధజన హింసాదీక్షా తంత్రులై కర్కశహృదయ తస్కరసందోహంబు వనవాటకంబులఁ గ్రుమ్మరుచుండఁ గంటక శిలాచ్ఛాదిత మార్గభూముల నెట్లు నీసుకుమార శరీరమును శ్రమపడఁజేయ నుంకించెదవు?

భీమా—కాశీబాయీ! నీ ప్రయత్నములు మిక్కిలి శోచనీయములు. వనవాసక్లేశమన సామాన్య మనుకొంటివి కాఁబోలు!

సీ॥ కూడి వేడుకలాడ ♦ లేడి కూనలు గావు
పొగరెక్కి చెలరేఁగు ♦ పులులు గాని;
పొలయుల్క విహరింప ♦ నెల వెలుంగులు గావు
పటుతర చండాత ♦ పంబె గాని;
ఆలింప శుకకలా ♦ పాలాపములు గావు
సక్రోధ సింహగ ♦ ర్జనమె కాని;
కనుసన్నఁ బనిసేయఁ ♦ బని కత్తియలు గావు
వలపెఱుంగని చెంచు ♦ చెలులు గాని;
గీ॥ తలఁచి చన లేమ! ఘోరకాం ♦ తార సీమ;
హృదయ మవిసెడి సుకుమారి ♦ వీవుగానఁ
గాపురేఁగుట మంచిగాఁ ♦ గానరాదు
కాంత! విడుమింతఁ బయనంపు ♦ కలవరింత॥

కాశీ—అత్తమామలారా! మీరు చెప్పెడి నీతు లన్నియుఁ జూడ నరణ్యభూముల శ్రమ యెక్కుడనియే నాకుఁ దోఁచెడి. కాని నేను మాత్ర మేమి యొనర్పఁగలను? వేదశాస్త్రములు గూడను

పతివ్రతా తిలక మనఁగాఁ బతియే వ్రతముగా గల సాధ్వీ కన్య యుంచునట్లు వచించుచున్నవి. కష్టముల సైచినగదా ఫలమునకుఁ బాత్రులగుదుము. అడవు లనినంతమాత్రము మీ రావంత నా వంతయు వీడుఁడు. వీరపత్నియగు నా కేమియుఁ గొదువ రాఁ జాలదు. భవానీ యనుగ్రహ మున్నచోఁ గార్యసాధకము గలుఁగకఁ బోవదు. నా నిజనాథుని సందర్శనము నాకుఁ గలుఁగకఁ బోవదు.

వాణి— అమ్మాయీ! నీకుఁ జెప్పవలసిన యంశములు లేవు. గుండె నిబ్బరమున నిట్లు పలుకుచున్నావుగాని, మాకుమాత్రము నిన్ను వదలుటయన్న సొడలు ఝల్లు మనుచున్నది. ఆయరణ్యమార్గాయాస మనుభవపడుటకే యెఱుఁగపడును, తల్లీ యేలత్వరిపడెదవు? నామాటలనాలించుము. నీవు గూడను మమ్ముల విడిపోయిన మా కేది దిక్కు?

కాశీ—అమ్మా! నేనుమాత్ర మేమిచేయుటకు నింక నిచ్చట నుండవలయును? జీవకళయన నెఱుంగని రాతిబొమ్మనై బ్రతికిన నేమి ప్రయోజనము? పౌరుషజ్ఞానకీర్తి విస్తారులయి పురుషులుగాని, స్త్రీలుగాని, బ్రతుకవలయును. లేకున్న నైహికా పరగతి దూరనై యజ్ఞాన లతాపాశ సంబద్ధనై కేవల వీరపత్నీ నామధారిణి నైన నేమి ప్రయోజనము? నా నాథుండు నిరుపమాన కష్టపరంపరాతిరేకమ్మున నహర్నిశంబులఁ గుందుచుండ నేనెట్లు సుఖముగా నుండఁగలను? ఒక కన్ను నీరు గాఱుచుండ రెండవకన్ను తడివెట్టక యుండునా?

వాణి—అమ్మాయీ! పతిభక్తి గూర్చి సవిస్తరంబుగాఁ జెప్పితివి. కాని యీ ముదుసలుల వదలిపోవుట కెట్లు మనస్సువచ్చె? దిక్కులేని మమ్మెవ రాదరింతురు?

శా॥ గారాబమ్మునఁ జూచు పుత్రికను గం ♦ గాఁబాయియిన్ దస్కరుల్
ఘోరారణ్యమునందు దొంగిలిరి, మా ♦ కున్ జాడ లీనాటికిన్

జేరఁ రావు కుమారుఁడన్న నో శివా ◆ జీ సేవకేతెంచె, నా
శూరుఁడుఁ బగజేతఁ జిక్కెనని య ◆ శ్రుల్ రాలె ధారాగతిన్॥

కను తెప్పలట్లు గాపాడుచు, గారాబమునఁ బెంచుచున్న నా సుగుణాలవాలమగు కుమారీవతంసమును నాఁటి నడవిలో దారిదోపుడు గాండ్ర చేతనిడి నీళ్ళు వదలితిమి. ఆ వంతచేతనే కుంది కృశించుచున్న యెడ గోరుచుట్టుపై రోఁకటిపోటు రీతిఁ గుమారుఁడును నిలు వెడల వలసివచ్చెను. భగవంతుని కృపావిహీనమునో పూర్వకర్మకృతానుభవమునో నా కుమారుఁడు నేతాజియు శత్రువర్గమునఁ జిక్కెను. చెడిన కాఁపురములే చెడును, తగిలిన కాలికే తగులును గదా! ఈసామెత నేఁటి కనుభవమునకు వచ్చినది. తండ్రీ! జగద్రక్షకా! ఎంతపనిఁ జేసితివి! అక్కరకు వచ్చు కుమారునిఁ బాపితివి. అనుఁగు కుమారిత నంతకు మున్నె పరులకొప్పగించితివి కాశీ! ఈ పండు ముదుసలులగతి యేమనియెదవు? శోకానల దగ్ధ చిత్తులయి కన్నీరు మున్నీరుగాఁ గార్చుచు వాపోవు మాకేది గతి? నీవే యిఁక నాధార మనుకొంటిమిగదా! అయినను బతి భక్తి హెచ్చు.

గీ॥ నీదుపతిభక్తి వలదన ◆ నీదు మనసు
నెలఁత మము వీడి వెడలిపో ◆ నీదు ప్రేమ
మాదు దుర్గతి నిను వీడ ◆ నీవు మమ్ము
నిట్టి దురదృష్టవంతుల ◆ కేది దిక్కు॥

కాశీ—అమ్మా! ముందుఁ బోయిన నూయి వెనుక బోయిన గోయివలె నున్నదిగదా! కర్తవ్యాంశ మూహింప వలను బడకున్నది. పతికిఁ బతియే దైవము. దిక్కులేని వారికి దేవుఁడే దిక్కు. పుట్టించిన వాఁడు పూరిమేపునా? కాలాతీత మగుచున్నది. అత్తమామలారా! అనుజ్ఞ నిడ వేడుచున్న దానను.

గీ॥ అమిత సాధ్వీమణులు దమ ◆ యంతి సీత
యాదిగాఁగల వారర ◆ ణ్యముల కేగి

చాటఁగా లేదె పతిభక్తి ♦ జగము నందు
భర్తతోడిద లోకంబు ♦ భార్యకనుచు॥

భీమా—అమ్మాయీ! నీకు మేము చెప్పవలసిన యంశము లెవ్వియు లేవు. ఇచ్ఛామాత్ర లీలావిగ్రహుండే వీని కంతకుఁ గారణభూతుం డగుగాత. నీ వబల వనియే నాకు సందియము.

కాశీ—మీ త్రికరణ శుద్ధియగు నాశీఃప్రభావంబే అబలనగు నన్ను సబలఁ జేసి ధైర్యకవచంబుఁ బ్రసాదించు గాత. నిశ్చలపతిభక్తియే నాకు మార్గాయాస కష్ట నిబిడాంధకార భాస్కరంబగు గాత. దైవకారుణ్య విలోకనా పరంపరలే మార్గమధ్యమున నా పద్రక్షణార్థమగు సుదర్శన చక్రజ్వాల లగుఁ గాత. ఇదియె నా యభివందనము. (నమస్కరించును)

భీమా, వాణీ—శుభమగు గాత. దైవమే నీకుఁ దోడగు గాత. పతిభక్తియే కొంగు బంగారమై విలసిల్లి కార్యసాఫల్య మొసఁగు గాత. పోయిరమ్ము.

(నిష్క్రమింతురు.)

(అవనిక జారును)

తృతీయాంకము.

---

## ద్వితీయ రంగము.

[గంగాబాయియు వేదవంతుఁడును విలాసార్థముగా నొక్క యెడ నాసీనులై యుందురు]

గంగా—ధానా! నేడు నాకొక శుభసూచక మేదియో కానవచ్చుచున్నట్లున్నది. ఈ ప్రదేశమంతయు ననూన మనోహరప్రకృతిచే వెల్లివిరియుచున్నది.

వేద—కాంతా! గృహలక్ష్మివలె నీవు వర్తించుచుండ శుభసూచకముల కేమి కొదువ? అన్నింటికి నీ నిర్మలవర్తనంబే ప్రధానకారణము.

సీ॥ మొలకనవ్వులతోడఁ ♦ గులకాంత చెలువారఁ
గలుఁగునే శుభ సూచ ♦ కముల కొదువ
చిలుకగోరంకులై ♦ చెలఁగు దంపతులున్న
గలుఁగునే శుభ సూచ ♦ కముల కొదువ
పతిభక్తి దయివార ♦ సతి వర్తిలుచునున్నఁ
గలుఁగునే శుభ సూచ ♦ కముల కొదువ
అనురాగలతలు వృ ♦ ద్ధినిఁ బొందుచున్నచోఁ
గలుఁగునే శుభ సూచ ♦ కముల కొదువ

గీ॥ పతికిఁదోడౌచు భార్యయు ♦ వరలుచున్న
క్షీరనీరంపు న్యాయ మే ♦ పారుచున్న
నతిథిపూజలఁ జేయుచు ♦ నలరుచున్నఁ
గలుగునే శుభ సూచకం ♦ బులకుఁ గొదువ.

గంగా — నాథా! మన ప్రసంగముల కేమిగాని, (దిక్కులు పరికించి) మన చుట్టుప్రక్కల నెచ్చటనో యశ్వపదాహతులు వినంబడు చున్నవి? ఎవరైయుందురు?

వేద — నీవెల్లప్పు డిట్టులే కలవరించు చుందువు. ఈనిర్జ నారణ్యమున కెవరైన వచ్చుట కేమి కారణమున్నది?

గంగా — మనోహరా! యించుక యాలకింపుఁడు. అదిగో! ఆదెస విలో కింపుఁడు.

మ॥ అదిగో! ఆకనుమేర దూరమున న ♦ శ్వారూఢులై యెవ్వరో
యెదుటన్ వచ్చెడిబాణ వేగమునఁ బ్రా ♦ ణేశా! విలోకింపఁగా
సుదతీ రత్నమువోలెఁ గన్పడియెదున్ ♦ జూడుండు; ఆసాధ్వి ని
య్యెదనందున్ మనయింటిలో నిలువ నా ♦ హ్వానింతు మర్యాదగన్

వేద — ఇంతీ! నీపలుకుల నొక్కొక్క దానియందును నమృత రసం బొలుకుచున్నది. నీ వాహ్వానింతువన్న నేను వలద నెదనా? ఇప్పుడు మన శిష్యునిఁ బంపెద. వాఁడామె నిటకుఁ దోడి తెచ్చును.

(తెరవంక బరికించి, వత్సా! అనిపిలుచును)

(తెరలో) గురువర్యా! ఆజ్ఞకై వేచి యున్నాఁడను.

వేద—శిష్యా, నీవు వెళ్ళి యావచ్చు సాధ్వీరత్నము నిటకు వినయంబున దోడ్కొని తెమ్ము.

(తెరలో) చిత్రము.

గంగా—నాథా! ఆ కాంతారత్నము మనదెసకే వచ్చుచున్నది. ఈ రమణీ లలామ ముఖారవిందము నవలోకింప మానసహోదరుని భార్యయందలి రూప లావణ్యంబు లచ్చొత్తి నట్లున్నవి. ఈమె యెవ్వరై యుండ నోపు.

వేద—నాకును నట్లే తోఁచుచున్నది ఈమె నిశ్చయముగా దత్తాజిగారి పుత్రికయే గావచ్చును?

గంగా—అయిన సంశయింప నక్కఱలేదు మీతలంపు నిశ్చయమే.

(తెరలో)

గురువర్యా! ఆజ్ఞనెఱవేర్చితిని, ఈమహాసాధ్వి దోడ్కొనివచ్చితిని.

వేద—త్వరఁగాఁ బ్రవేశింపఁజేసి నీవుపోయి యధ్యయనాదులఁ జూచు కొమ్ము.

(కాశీబాయి ప్రవేశించును.)

గంగా—అమ్మా! కాశీ! (కవుంగలించుకొని) ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు నిన్నుఁగాంచితిని. అమ్మా ఇప్పుడెచ్చటి నుండిరాక?

కాశీ— ఊరినుండియే వచ్చుచున్నదానను.

గంగా—కాశీ! మనయూరియందలి క్షేమవార్త లెవ్వి? అందఱును కుశలులే గదా!

మ॥ సహజన్ముండగు వానికిన్ సుఖమె, వి ॰ శ్వాసంపు మిత్రాళికిన్
గృహిణీవర్తనమందు మేటి యనుర ॰ క్తిన్ బూను మాలెల్లకిన్
మహిమాఢ్యుండగు నాదు తండ్రికినిఁ బ్రేమన్ జూపుచుట్టాలకున్
మహిళారత్నమ! క్షేమమా? వినఁ జనింపన్ సాగె నానందముల్

కాశీ—(నిట్టూర్పు పుచ్చుచు) ఏమిక్షేమము? ఉన్నవారలమిట్లున్నాము.

గంగా—ఏమీ! అట్లనియెద వేల?

కాశీ—ఏమియును లేనియెడల నేల నిట్లందును? ఏల మఱల నా

సంతాపాగ్నిఁ బ్రజ్వరిల్లఁ జేసెదవు?

గంగా——సంతాప మేల? క్షేమవార్త లడిగిన సంతాపమా!

కాశీ——నీవడుగుట క్షేమవార్తలే. నేను బ్రత్యుత్తర మొసంగునవి దుఃఖ వార్తలుగ నున్నవి. అమ్మా, నీయనుజన్ముండును నాకుఁ బ్రాణేశ్వరుండును........(అనఁబోవును).

గంగా——నాయనుజన్ముఁడేమాయెను?

కాశీ——ఏమగును? శ్రీ శివాజీచక్రవర్తిగారు తమకు సాయపడ రమ్మని యొక శ్రీముఖమంపిరి. తేనియానల శిరసావహించి వెంటనే యశ్వారోహణంబుఁ గావించి బయలు వెడలె. తరువాత వార్తలు తెలియరావు. ఆయశ్వరాజము మాత్ర మనాథమై వచ్చె.

గీ॥ శ్రీ శివాజికి సాయమ్ముఁ ♦ జేయఁబోయి
మరలఁడాయె నీదు సో ♦ దరుఁడు గాన
నతని జాడలఁ గనుఁగొన ♦ నాత్మ నెంచి
తరలితిని భామ! ఘోర కాం ♦ తారసీమ.

గంగా—— హా! విధీ! ముదుసళ్ళగు తల్లిదండ్రులకు దిక్కులేకఁ జేసితివా! ఆతఁడెచ్చటనున్నాఁడో గదా! హా! సోదరా! సుతాజీ! నీ జననీజనకులు నినుఁ గనుఱెప్పలట్లు గాపాడుచు వారి వార్ధక దశయందు అక్కలకడ్డము వత్తువుగదా యని పేరాసఁబడుచుండిరి. వారి యాశలన్నియు నేలఁగలిపితివిగా! వారికింక దిక్కెవ్వరు? నన్నన్వేషించు విషయమై వారు ప్రాణములు విసికి మానుకొనియుందురు. హా! సోదరా! కుమారుఁడవగు నీవుగాని, కుమార్తెనగు నేను గాని వారి వార్ధక్యమున నుపయోగకారులము గాక పోతిమిగదా. మా మాతృ ఋణమెట్లు తీర్పవలయుననుకొంటివి? సోదరా! అనుజన్మా!

గీ॥ యోగమొక్కటి మంచిదై ♦ యుండెనేని
కొదువలెవ్వియుఁ గనరావు ♦ పుడమియందుఁ
బంక్తులను దీర్చి వ్రాసిన ♦ బమ్మ వ్రాఁతలు
మీఱి నడువంగ వశమె యె ♦ వ్వారికైన?

కావున విచారించిన ఫలమేమి? ఏకాలమ్మునకేమి వచ్చునో ఎవరు చెప్పగలరు? భగవదేచ్ఛావిరుద్ధ ప్రవర్తకులగుటకు మనుజులకేమి సామర్థ్యమున్నది? అమ్మా! విచారింప నవసరము లేదు. కర్తవ్యమూహింపవలయును. కాశీ! నేనును నీవెనువెంట వచ్చెదను. నాసోదరుని మరలఁగొనితెత్తుము. నీవు మార్గాయాసమున బడలియున్నావు. ఇంచుక మా పర్ణకుటీరంబున విశ్రమించి యాయాసక్లేశముఁ బాపుకొనియెదవుగాక. కాలమతిక్రమించుచున్నది. వెడలుదము రమ్ము.

(నిష్క్రమింతురు.)

(తెర వ్రాలును.)

ద్వితీయాంకము.

---

తృతీయరంగము.

(ప్రదేశము:— నిర్జనారణ్యము. వేణువు నూదుచు గోపాలకు లిరువురు ప్రవేశింతురు.)

వెంకఁడు— ఓరే! యీరా! యియ్యాల నీవు పాటతో వుంటే నాకు బలే కుశాలుగా వుందిరా. నా మన్సుకు బలే సంతోసమేసిందిరా. కానీవు యీడ కూకుందాము రారా.

వీరఁడు— ఎట్లావుంటది లే. కూడు మస్తుగా తినుండావు.

వెంక— కూడు లేకుంటే కుషాలుంటుందిరా! ఒక కీర్తనకానియ్యరా నేను దరువేస్తా.

వీర— నా కీర్తనికి నీ దరువు పడితే ఆకాశాన పచ్చులు పాడతాయి. ఓరెంకా! సూడ్రే! పసులు జీవాలు పరిగెత్తుండాయ్. యేదో వస్సిందేమో జీవాలు లాక్కెల్లడానికి.

వెంక— యిక్కడి కేరొస్తారురా? కలారిస్తాయుండావ్. నీవెల్లిసూడు. లేవలేనోణ్ణి నన్నేడిపిస్తావేం సూడమని? కూకోరా గొడ్లేడ కెల్తాయి. పాడ్రా! కానీవు.

వీర—ఉండోస్. గొడ్లు పరిగెత్తికెళ్లాయంటే యింటికాడ కామందు లోరిచేత దరువు పడుద్దిరోయ్. ఎళ్ళి సూసొచ్చి పాడుకుందాము రా.

(కొంచెము దూరమునడచి)

వీర—ఓరో వస్తుండాల్రా. దేవతల్లాగా వుండాల్రా. సూద్దాం పద.

వెంక—పోరోస్. వత్తే ఆల్లే యిటొత్తారు. కూకోరా. అబ్బ! కూకో.

వీర—ఆదేంట్రోయ్. ఆడ సిత్రం చేస్తావుండది సూడ్రా.

వెంక—మొన్నే బారెడుపొద్దుకాడ ఎందుకో గొయ్యితీసిందిరా!

వీర—యీయాలకూడా గొయ్యెందుకు చేస్తుందిరా? ఆమనుసులేరు దానిపక్కన?

(తెరలో) హా! నాథా! మనోవల్లభా! హా సోదరా! చేతాజీ నన్నెట్లు మరచిపోతివి? నీయనుంగు సోదరి నెట్లువిడనాడిపోయితివి?

వీర— అరేయెంకా! ఆల్లు ఏడుస్తావుండారేం? సూసిరా!

వెంక—ఆల్లు మొగోల్లుకుమల్లేవున్నార్రో. మన్నికొడ్తారేమో.

వీర—ఊరికుంటే ఓర్రాకొట్టేది? కొడితే ముల్లుకర్రతో పొడుద్దాం లేరా!

వెంక—ఆల్లు మొగోల్లేరా? నాకూ సందేగమాతుండాది. ఇంతసే పేడుత్తావుండారేం ఆడల్లోకిమల్లె?

వీర—ఓరే? నీకేంరా? సింతా సీకాకు లేనోడివి. నూవు అల్లునరేరా? మన కేంవుండాది సెప్పు? పైటాల గొడ్లకాడుంటామూయె. సాయంత్రం గుడిసెకాడ గొంతులో గంజోసికొని పడుంటే అదే దేవలోకం మనకి.

వెంక—ఇంతకంటె ఆల్లకేం ఎక్కువ? కూడుంటే చాలదూ.

వీర—ఆల్లు మారాజులురా. ఆల్లకు దమ్మిడొస్తే ఏగాణి చెయ్యాలంటారు. మనకేం వుండాది? ఆల్లిటు వొత్తుండారు. మాటాడకు.

(పురుష వేషమునఁ గాశీబాయియు గంగాబాయియు ప్రవేశింతురు)

కాశీ—(పసులఁ గాఁపరులఁ జూచి) బాలులారా! మీరెవరు?

వెంక—మే మేల్లమైతె మీకేం? మీరోరు?

కాశీ—(గంగఁజూచి)వీఁడెవఁడో పెడకట్టవలెనున్నాఁడే! (వీరని వైపునకు దిరిగి) నాయనా మీరెవరు? మీపేరేమి?

వీర—నాపేరు వీరడు. ఆ డొంకడు. అయ్యోవ్! మేమే యాకూరెడ్డి కవుకోళ్ళం. ఈడే గొడ్లకాసుకొంటుండాం. మీరోరు? దేవరా!

కాశీ—మేము బాటసారులము. మీరిక్కడ నీగుఱ్ఱమును నిదివరకెన్నడైన జూచితిరా?

వీర—ఈగుఱ్ఱం మూన్నాళ్ళకిందె ఒక మొగాయన్ని యెక్కించుకొచ్చింది. ఆయన్ని చూస్తె బలే జమానులాగుండాడు.

కాశీ, గంగా—(ఆతురతతో)అటుపిమ్మట నాతఁడెచ్చటికిఁ బోయెనో యెఱుఁగుదురా?

వీర—ఆయనికి దాహమేస్తావుంటె కాలవలో దిగి నీళ్ళు తాగతావుండే తలికి అబ్బో! అబ్బో! ఏంసెప్పను (తలవెంట్రుకల స్పృశించుచు) ఇంతమంది యేడనుంచో పుట్టుకొచ్చారు. ఆయన్ని పైఁబడి పట్టుకొన్నారు.

కాశీ, గంగా—హా! దైవమా! ఎంత జేసితివి! పిమ్మట నేమాయెను?

వీర—లాడాలేసే యెద్దుకుమల్లె ఆయన్ని కట్టి పడేసి గుడ్డలు కుక్కి తీసికెళ్ళారు.

కాశీ—ఆసమయమున నాతఁడేమనెనో యెఱుంగుదువా?

వీర—ఏదో అన్నాఁడు. కాశీ గంగ అన్నట్టున్నాఁడు. అప్పుడీగుఱ్ఱం తప్పిచ్చుకొచ్చింది.

కాశీ—హా! ప్రాణేశ్వరా! మనోవల్లభా! జగద్విదిత విజయధ్వజ స్థాపనం బొనరించిన నీకు గూడ నేటికిరీతిఁ నపజయము సమకూరెగదా! హా! విధీ! నిన్నేమనం దగును? నానాథు నెంతటి కష్టస్థితియందుఁ బాలువైచితివి? నాకేమిత్రోవఁ జూపించితివి? హాదైవమా (మూర్ఛిల్లును.)

వీర—ఏడస్తావుంటే అవుద్దీ పని?

గంగా—ఏమిచేయుము నెదవు నాయనా? హా! సోదరా! నేతాజీ! వృలగు తలితండ్రుల కెంతటి మనోఖేదంబు గూర్చితివి! అనుంగు పు

కనఁగ నన్ను విడనాడి సంకుచనే శల్యావశిష్ట శరీరులగు జననీ జనకుల కిఁక దిక్కెవ్వరు? మూఁడునాళ్ల ముచెలుల మునవ్వుడు తమ తెక్కలి కద్దనువత్తురనిగదా, గౌతమాయలపైఁ బ్రేమాతిశయములఁ గన్నవారలు చూపించుచు. హా! అనుజన్మా! నీ వియోగమ్మునచే నిఁక మేమెల్లరము జీవచ్ఛవములము గావలసినదేనా? ఎన్నఁటికైనను నిను దర్శించు మహాభాగ్యము మాకన్నులకు గలుగునా? హా! నేతాజీ!

కాశీ—(మూర్ఛఁదేఱి) నాయనా! అబ్బాయీ! వాడు పిన్నటి నే మార్గముఁ బోయిరో చెప్పఁగలవా?

వీర—ఇటే నతానా కెత్తేదోవకేసి తీసికెళ్ళారు.

కాశీ—అబ్బాయీ! నీవు మాకీనిర్జనారణ్యమునఁ జేసిన యుపకార ఋణంబును దీర్పంజాలము. కాని ఈ వరహా తీసికొనుము. (అనియిచ్చి) యికవెళ్లి వచ్చెదము. గంగా! పయనము సాగింతము.

(నిష్క్రమింతురు)

(తెరపడును.)





# కాశీవిజయము

## చతుర్థాంకము.

### ప్రథమరంగము.

ప్రదేశము:— నేతాజీ చెఱసాల

నేతాజీ—(స్వగతము) ఆహా! ఏమి దైవమహిమ! శివాజీ చక్రవర్తి నన్నాజ్ఞాబద్ధుం గావించి పంపినది యొక కార్యము, నేనిక్కడ నొనర్చుచుండెడిది వేఱొకటి యాయెనే. నాపై నాతఁ డాసల నినుమడించుకొనుచు, నాకాశంబునకు సోపానంబులు కట్టుచుండును. కాని యిచ్చట నేననుభవించు కష్టమెట్లు తెలియఁగలఁడు? దైవమా! కకుబంత విశ్రాంత యశశ్చంద్రికా విలసితుండును, నిరంతరార్తరక్షణ దీక్షాకంకణాలంకృతుండునై, నిర్వక్ర పరాక్రమాక్రమిత విజాజియు నగు శ్రీశివాజీ చక్రవర్తిచేఁ బోషితుండనై యాతండు కాంక్షించిన యుపకారలవం బొనరింప శక్తివిహీనుండనై యుంటినిగా! "తిన్న యింటివాసంబులు లెక్కబెట్టు" నట్లు దయారస సమన్వితుండగు చక్రవర్తి గుట్టు మట్టులన్నియు శత్రువర్గ దుర్గాధికారికిం జూపఁ గ్రుచ్చినట్లు చెప్పవలసి వచ్చునేమో కదా. ఇప్పటికే యాతఁడనేక విధముల ననేక పర్యాయముల నీ విషయంబులఁ జెప్పుమని నిర్బంధపఱిచిన వాఁడు. కాని యిప్పటికేమియుఁ జెప్పినవాఁడను గాను. ముందెట్లు కానున్నదో, ఎవఁడెఱుఁగును? ఎట్లయిననుసరే. మనోధైర్యము వహించి యుండవలయును. మహారాష్ట్ర కీర్తిగౌరవములఁ గాపాడుకొనవలయును. ఇచ్చటి నాస్థితియంతయు నాకే

విషాదకరంబును నాశ్చర్యకరంబు నగుచున్నది. శత్రువర్గములఁ బారిఁ జిక్కి రాజ్యోద్యమ ప్రయత్నంబునకు దూరుండనై, కేవల మేకాకినై, నిర్మానుష్యప్రదేశమున నుండి నే నేమి చేయఁగల వాఁడను? శత్రుబారి నైన నేమి? ఆహారంబునకు నించుకంతయు లోపంబు కలుగకుండ నియమితకాలంబునకే వలయు పదార్థముల సమకూర్చుచున్నారు. ఏమి నావృత్తి! నిరుపయోగముగ కాకిటులఁ గుక్షింభరత్వమున సంతృప్తుఁడనైనచోఁ గీర్తి నార్జింపనగునా?

తే॥ గీ॥ తిండికై మాత్ర మూర్విపై ♦ నుండు నిష్ప
యోజకుం డున్న లేకున్న ♦ నొకటె ఫలము
ఒరుల కుపయుక్తములుగాక ♦ నుండుపండ్లు
కాయవే సృష్టి చెట్లలో ♦ కంబునందు॥

చ॥ తనతలిదండ్రులందు నిర ♦ తంబగు రక్తియు, బంధువర్గమం
దునఁ బ్రియమున్, సహోదరులతో ననురాగము, జన్మదేశర
క్షణమున భక్తి, శక్తి కల ♦ కాలము నిల్పుట కీర్తిఁ గాంచు ల
క్షణములుగాని, పొట్టకయి ♦ కాంక్ష వహించెడు జన్మకాల్పనే।

ఇదివఱకెల్ల నపజయవార్తఁ గలనైనఁ గనక నప్రతిహత జయభేరీధ్వనులచే జయమును చాటించి రాజమాచీ కళ్యాణపురంబుల నేలికకు స్వాధీనపఱచితినను నమ్మికనే గదా, శివాజీ మహారాజు నాయందింతటి నమ్మకముంచి పంపె. ఔరా! విధివ్రాలు తప్పింపనగునా? తానొండు దలఁచిన దైవము మరొండు దలచు ననుట యిట్టిదేసుమీ! జీవచ్ఛవంబనై జన్మదేశంబునకుగాని, తన్ను గ్రాసవాసములకు లోపమ్ములేకుండఁ బోషించు ఱేనికిఁగాని, పసం జేసియు సేవఁ జేయఁజాలని నావంటి నిష్ప్రయోజకుం డుండి యేమిప్రయోజనము?

మ॥ తన బాహాబలవిక్రమం బెసఁగ యు ♦ ద్ధక్ష్మాతలిన్ నిల్చి వై
రినికాయంబు నెదుర్చిఁ ఢీకొనుచు దో ♦ ర్లీలన్ విజృంభించి కీ
ర్తినిఁ గాంక్షించి స్వదేశసేవకయి శ ♦ క్తిన్ జూపలేనట్టి యా
జన్ము, జన్మంబిక సార్థకంబగునె, వీ ♦ సంబైన లాభించునే.

గీ॥ జననమూ మహారాష్ట్రి వం ♦ శమ్మునందు;
పెరిఁగి వర్ధిల్లుటా యన ♦ భరతభూమి;
వీర నేతాజి యనుపేర ♦ వెలయునన్ను
నీవకృపఁజూడవలె భవా ♦ నీమతల్లి.

హా! భవాని! శక్తివంచన లేక దేశసేవ నొనర్చుటకు నాకేదియు నుపాయము గానరాకున్నది. ఈభారంబంతయు నీపైవైచి నాజాతిమతాచారంబులకుఁ గళంకము రాకుండఁ గాపాడఁ బ్రార్థించువాఁడను. అదిగో! ఆదుర్మార్గుఁడగు దుర్గాధ్యక్షుఁడు వచ్చుచున్నాఁడు. ఈనాఁడు నన్ను నిర్బంధించునని తోఁచెడి. ఇఁక మౌనము వహించియుండుటయే శ్రేయోదాయకము.

(దుర్గాధ్యక్షుఁడు ప్రవేశము.)

దుర్గా—ఏమి నేతాజీ! మహావీరా! నేఁడేదియో ముఖవికాసమున మార్పుగలిఁగినట్లున్నదే? వైచిత్ర్యము లేమున్నవి?

నేతాజీ—వైచిత్ర్యము లేమున్నవి? ఏవియు లేవు. నిరంతరము సంతోషముగ నుండుటయే సాధులక్షణము, శూరలక్షణము. అయినను స్వాతంత్ర్యవిహీనుండను, బరాధీనుండను నగు నాకేవిశేషములు తెలియును?

దుర్గా—సరియే. నేఁజెప్పువాని నాకర్ణింతువా?

నేతా—అవశ్యమాకర్ణింతును.

దుర్గా—సహాయ మొనర్తువా? అవసరమున్నచో

నేతా—(తనలో) సహాయమనుచున్నాఁడే! నేఁజేయఁదగిన దేముండును? (ప్రకాశముగ) నాచేతనగు సహాయమేమున్నది?

దుర్గా—ఏమున్నదని యెదవేల? ఉన్నదియంతయు నీయొద్దనే. ఈసతారాపట్టణపుఁ జుట్టుప్రక్కలనేగదా మహాబలేశ్వరమున్నది? అయ్యది యిప్పుడు మామహారాష్ట్రులచేఁ జిక్కినది. తత్కారణమునఁ దుపుష్కరాష్ట్రమంతయుఁ బ్రతినిమేషము వెఱువవలసి వచ్చినది. జనులకెల్లరికిఁ గనులనిండ నిద్రకేకఱవాయె. ఇవియన్నియు నీవెఱింగినవేగదా?

నే.——(స్వగతము). సంభాషణను బట్టి విచారింప మహారాష్ట్రులవీడి తమపక్షమవలంబింపఁ గోరుచున్నట్లున్నది. ఔరా! ఎంతటిద్రోహబుద్ధి! మతద్రోహి యెవర్ని యుత్నించుచున్నట్లున్నది. కానిమ్ము.

దు:——ఏమి! నేతాజీ! చిత్తంబు పరాయత్తంబయినట్లున్నదే?

నే:——పరాయత్తంబగుటకేమున్నది? ఇప్పుడు వచింపఁబడిన వార్తల యందలి యర్థవిశేషమునే తర్కించుకొనుచున్నాను.

దు:——(తనలో) వీనికి నామనోనిశ్చయమెట్లు తెలుపుదును? తెలుపుట కింత సంశయించుటయేల? అంగీకరించి సహాయమీయ నిచ్చగింతునో, లేదో? పోనిమ్ము. అంగీకరించిన మిక్కిలి శ్రేయస్కరము. లేదా, కసిదీర్తును. (ప్రకాశముగ) నేతాజీ! ఈవిషయమును శ్రద్ధతో నాలకింపుము.

తే॥ గీ॥ నాఁడు నిను ఖైదిగాఁగొన్న నాఁటినుండి
గ్రాస లోపమ్ము లేక సుఖమ్ము గొలిపి
గౌరవమ్మిచ్చు నీ బీజపూరువారి
వినయ సద్భావ మీ వెఱుం గవిదిగాదు.

నేతా——అవును. పిమ్మట

దుర్గా——వినిపించుమ. నేమి వచ్చునో యెవఁడెఱుంగును? ఎల్లప్పుడు మహామ్మదీయుల హృదయంబులు శివాజీరాక వెఱచుచున్నవి.

శా॥ నాకున్ గంటికిఁగూర్కు లేదు, సుఖమున్నన్నున్న, యెవ్వేళకో
యేకాలమ్మునకో శివాజియిటు తానే తెంచి సైన్యంబుతో
నీ కోటన్ వెస ముట్టడించునని మే మెంతేభయం బొంది, యౌ
రా! కోరందలపోసి యుంటిమిదె సాహాయ్యంబు నేమందువో.

అయినను ఇంకొకమాటఁజెప్పెదను. నీకిచ్చటజరుగుచున్న సపర్యలయందు నేమాత్రముఁగొఱఁత లేకున్నది గదా? మీ మహారాష్ట్ర గౌరవంబునకు మాగౌరవంబునకును హస్తిమశకాంతరముగలదు. మీచేఁబడిన శత్రువర్గమునకు జరుగు గౌరవమును మాచేఁబడిన శత్రువర్గములోని వాఁడవగు నీకిచ్చోట జరుగు రాజభోగమును నీకే తెలియును, చెప్పుటనవసరము.

నే — మీరువచించిన దంతయు నిశ్చయమే.

ఉ॥ మీ వినయాభిమానములు ♦ మీ రొనరించెడు గౌరవంబులున్
మీ విభవంబు, మీదయ యఁ ♦ మేము మహోఘము చెప్పవచ్చునే?
భావన సేయనుంత సుల ♦ భమ్మగు గ్రామ్య మదంతమీకు, స్వా
మీ! వచియింపనాకుఁదర ♦ మే? యిదిలోక మెఱుంగకున్న దే?

దుర్గా — వాచాలా! నేనునీయందలి గౌరవముంచినందులకు నీవు దానిని నిలుపుకొనఁ జాలకున్నావు. నీమెత్తి పోడుపుమాటల వలనఁ గ్రోధాగ్ని రగుల్పబడును. అంతయు నీమంచి కొఱకే చెప్పుచున్నాను. కాని యీదియంతయు నీకు విషముగ నున్నది.

నేతా — నేను చెప్పినది మాత్రమేమున్నది? ఉన్నమాట వచించితిని. ఎట్లయిననుఁదమ మనోనిశ్చయము వెల్లడించుఁడు. ఇంకను నేదియో తమరు చెప్పఁదలఁచుకొని నట్లున్నదే. అదియు వెలిఁబుచ్చుఁడు.

దుర్గా — ఏమియు లేదు. నిన్ను బాగుపఱుపఁ దలఁచుకొని చెప్పుచున్నాను. విరుద్ధాభిప్రాయుండవు కాకుము. భవిష్యదభివృద్ధి గలదు. సావధానుండవై నా పలుకు లాలకింపుము.

ఉ॥ ప్రేలకు! యొక్కమాట విని ♦ పించెద, నీబిజపూరు వారి కీ
యాలమునందు నీదగు స ♦ హాయము ముఖ్యము; తిన్నయింటివా
సాలను లెక్కఁబెట్టెడి ప్ర ♦ సంగము లన్నియు మాని, విక్రమా
స్ఫాలిత శౌర్యరాసులు బి ♦ జాపురవాసుల పక్షమూనుమీ!

నేతా — (స్వగతము) జాలరి యెరఁ జూపిగదా చేఁపను వలలో వైచుకొనును. ఈ దుర్బుద్ధి వెల్లడించుటకే కాబోలు ఈ యుపోద్ఘాతమంతయు! (ప్రకాశముగ) ఓరీ! తుచ్ఛా! ఇంత సేఁపటి నుండియు నేమియో మర్యాద సూచకంబులుగఁ బలుకుచున్నందున మోసపోయి యుంటిని. మీ పక్షమువలంబింప వలయునా? ఎంతటిమాట! స్వామి ద్రోహముఁ జేయుమనియెదవా?

ఛీ రా! దుర్గాధ్యక్షా! ఎంత పలుకాడితివి!

గీ॥ జాతివిడనాడి శత్రుప♦క్షంబుఁ బూని
తేని వంచించి వైరుల♦తేనిఁ జేరి

పోషకునకుఁ గోడ రణము సల్పుట యటన్న
నింతకంటెను ద్రోహమింకేమి వలయు?

ఉ॥ కుత్తుకయందుఁ బ్రాణములు కూడియె యుండిన మాతృభూమికే
యిత్తునుగాని నాయసువు లీరిపుజారికి జంకి లొంగి మీ
చిత్తము వచ్చినట్లు లిఁకఁ జేయను, చేసిన ద్రోహబుద్ధిచే
నెత్తెర గీమొగంబిలను నెత్తి పచారుల సేయగా వలె౯

అయినను నిప్పుడిన్నను నూడిగముఁ జేయవలయు నను సాహ్యమీ వెఱుంగనిదె కాదుగదా. అట్టియెడ నాయందు నిరంతరాభిమానుండును, నిర్హేతుకజాయమానకృపావిశిష్టుండునునగుచు వాత్సల్యమునఁ బుత్రుని కన్న నెక్కువగను నధికారమున నమాత్యుని కన్న నెక్కువగను, నింతయేల, నన్నే తనబహిఃప్రాణముగ భావించుచు నెల్లప్పుడు నాశ్రేయోభిలాషియగు శ్రీ శివాజీ చక్రవర్తి తోడనా రాజద్రోహినయి యాలంబున నెదుర్కొనుట! హా! దుర్గాధ్యక్షా! ఇట్టి గట్టి పట్టుదల గలట్టి యోధునకు, జన్మభూమి సేవాపరతంత్రునకు, రాజద్రోహ, దేశద్రోహ, మతద్రోహ, కళంకముఁ గూర్పదలంచితివిగా! నీయభిప్రాయము వెలిబుచ్చుటకు నెంత సాహసించితివి!

దుర్గా—వాచాలా! క్రమక్రమముగా శ్రుతి మించి రాగమునఁ బడుచున్నట్లున్నదే. ఇప్పుడిన్న నూడిగము జేయవలయుఁ నంటివిగదా! నిను బంధితు నొనర్చినది మొదలీవెవరి యుప్పుఁ దినుచున్నావు? బీజాపూరు వారిదే యని యొప్పుకొనవా?

నేతా—నిశ్చయము. బాల్యమునుండి యింతవరకు మాత్రము మహారాష్ట్రులదే కదా.

దుర్గా—వాగ్వివాదమునఁ బనిలేదు.

చ॥ అహమిక లోనఁబూని, బహులాడగ సాహసమూని నాకు నా
గ్రహము జనింపనీకు, రణ రంగమున౯ బగర౯ జయింపని
విహమున మాబహూకృతి వహించి పరమ్మున వీరనాకపుం
మహిత యశమ్ముఁ గాంతువు, క్రమంబుగ నాపలుకాలకించిన౯

ఈవిషయమింతగా నీపురోభివృద్ధిగోరి చెప్పఁబడినదని త్రికరణశుద్ధిగా నమ్ముము. త్వరపడి ముప్పుఁ దెచ్చుకొనకుము. మాంబిజాపుర సుల్తానువారి యనుగ్రహము సంపాదించుకొనినచో నీకు నకరిమిత సౌఖ్యము గలుగు. యశమ్ము దశదిశల బిక్కటిల్లు.

చ॥ పసుపుతనంపు బింకములఁ ♦ బాఱఁగఁదోలి యశమ్ము నొక్క చే
గడన నొనర్ప నెంచుము సు ♦ క్షమ్ము వహింతువు; లేకయున్న నీ
దుడుకు దనంబె నిన్ను పు డ♦ ధోగతి పాలొనరించు; నింతకుఁ
జెడియెడి కాలమున్నఁ బ్రతి ♦ సేయఁగ నేరికి సాధ్యమౌనిలన్?

నేతా—ఏమైననను ము. నాపట్టుదలమాత్రము నే వీడను. నీవీమాటల నాడుచుండినను నాయభిప్రాయ మంగీకరింపదు.

దుర్గా—నేతాజీ! నీకింకను మూర్ఖ్యము వదలినట్లు లేదే. నేనువచించు మాటలన్నియు నీకొరకే యనుకొంటివా? లేక ఏదియో వాగు డనుకొంటివా? ఈ నా ప్రశ్నలకు దగు జవాబుల నొసంగుము. ఇదియె నీతోడి సంభాషణకు నంతము.

సీ॥ సాయంబుఁజేతువా ♦ జైలులో నుందువా
చెప్పుమా యంచుఁబ్ర ♦ శ్నింతు మొదట
అడిగినట్టులఁ జేతు ♦ వా? లేక మానని
జేతుమా? యంచుఁబ్ర ♦ శ్నింతు రెంట
ఈపట్టుదల మాన ♦ నెంతువా? లేక శి
క్షింతుమా? యంచుఁబ్ర ♦ శ్నింతు మూఁడు
మీజేని విడనాడి ♦ మాజేని రణమునఁ
జేరవా? యంచుఁబ్ర ♦ శ్నింతుఁ దుదిని
గీ॥ అనుచు నీప్రశ్నలొకదాని ♦ వెనుకనొకటి
నడుగ సాగితి యోధనా ♦ యకుఁడవంచుఁ
దగుజవాబుల నెంచి స ♦ త్వరము నిచ్చి
యరసి కొనుమయ్య! నీయొక్క ♦ అశుభమొ, శుభమొ.

నేతాజీ! ఆలస్యంబున కిఁక నంగీకరింపను.

శా॥ కాలంబిప్పుడతిక్రమించుచునది ♦ మార్గద్వయంబూని నీవున్న నో
రీ! లాభమ్మొక గల్గఁబోవదు పరా ♦ రిన్ జిత్తగించంగ నే
వీఁకన్ గాని యలభ్యమియ్యెడ; రణో ♦ ద్వేగ్ బీజపూర్వ్యాసులన్
లేఁ న్ జేరుటో? ఖైదివివశుటో? రెం ♦ డే రెండుమార్గమ్ములౌ

నేతా—(స్వగతము) ఏమీ! వీని వాచాలత! వీరిని నేను చేరవలయునట, లేకున్న వీరిచేత ఖైదిగానే యుండవలయునట! వేడినీళ్లకుఁ గొంపలు కాలునా! వీని డాంబికవచనంబులకు, బెదరింపుమాటలకు వీనికి నేను లొంగి "దాసోహ" మ్మనెద ననుకొనెనుగాబోలు! (ప్రకాశముగ)

గీ॥ ఆఁకటికి సుక్కి సోలి జ ♦ రాకృశియయి
నష్టరుచియయి ప్రాణావ ♦ శిష్టమయ్యు నన,
గంధ కుంభీంద్ర కుంభ ర ♦ క్తమ్ము గొనకఁ
బూరి నేటికి మేయుఁ గం ♦ ఠీరవంబు

కాలకర్మమానస్థితులను బట్టి బంధితుఁడనయినను, నీద్రోహ బోధనకు లోఁబడుదు ననుకొంటివా! వైపద్యమే నాభావమును విపులీకరించుచున్నదిగదా.

దుర్గా—శూరా! తొందర పడుచున్నాఁడవు. బాగుగా యోచించుకొనుము. కాలుజారినఁ దీయవచ్చును. కాని నోరుజారినఁ దీసికొనుట యసాధ్యము. యోచించుకొని మాటలాడుము. ఉసురుల దక్కించుకొనుము. ప్రాణములపై దీపి యెల్లరకు సహజమే గనుక నింతఁగాఁ జెప్పుచున్నాను నీకర్మమెట్లున్నదో? ఎవఁడెఱుంగును? పరిపక్వ భాగ్యఫలమును జేజేతఁ ద్రోసిపుచ్చుకొనుచున్నావు. ఇంతటి యవివేకి యెవఁడయిన నుండునా? "పరోపకార మిదం శరీర" మ్మను నుడువు లేల నీవు పాటింపవు? పాటించినచో నేమైనఁ బ్రత్యుపకృతియే నీకు గలుఁగుఁగాని యపకారము లవంబేనియుఁ గలుఁగదు గదా. అనుకూలాభిప్రాయంబును వెలిఁబఱచుము. నీపట్టుదల యేకాకివియు, నసహాయివి నగు నిన్ను రక్షింపఁజాలదు. మూర్ఛించినచోఁ గారాగారమే నీకు శరణ్యమగును. నామనోభి

ప్రాయమంతయుఁ బూసగ్రుచ్చినట్లు తెలియఁబఱచితినిగదా. నీప్రాణరక్షణోపాయంబంతయు నీచేతనేయుంచితి. దానిని నెగ్గించుకొనుట నీయధీనము. వీరాగ్రేసరా! నీమనోభీష్టంబు నెఱవేఱుగింతుము. ఇఁకఁ జెప్పవలసిన దేమియును లేదు. అదృష్టలక్ష్మి వరింప నున్నది.

నేత—వాచాలా! పసఁబ్రాకిన వానివలె వదరితివి. నీ పరుషోక్తులకు నుత్తరమీయఁ దగకున్న దేహమంతయు నీచే రగుల్పంబడిన క్రోధానలజ్వాల కీలావలంబితంబై మిన్నకుండనీయకున్నది. చెఱసాల యనినంత మాత్రముననే గజగజ వణంకి నీశరణు నపేక్షింతు ననుకొంటివి కాఁబోలు. పాప మెంత వెఱ్ఱివి! మహారాష్ట్రుల రాజభక్తియు, దేశభక్తియు, నీ వెన్నండేని నెఱుంగని కారణంబున నిట్లు పలుకుచున్నావు.

ఉ॥ ఆలములోన మీకు నెదురాడము, పట్టినపట్టు వీడఁగాఁ
జాలము, శిక్షసేయఁ జెఱసాలకుఁ బోవఁగ సిద్ధమేము, లం
చాలకు లొంగఁబోము, కుడికాంతము మాత్రము వీడఁబోము, మం
త్రాలకుఁ జింతకాయ లిటు రాలునె, యోక్రియయుక్త మక్కటా!

నేను ధృఢ దేశాభిమానంబు వహించి, యెట్టి కష్టములకయిన నోర్చి దేశసేవా పరతంత్రుండనై, యైహికాముష్మికములందు దిగంత విశ్రాంత కీర్తి వహింతుఁ గాని, తుచ్ఛసౌఖ్యంబులఁ గాంక్షించి దేశద్రోహ నగుదు ననుకొంటివా? కాను, కాను.

దుర్గా—ఊరకయే కమ్మన్న నెట్లు చనువు? సామదానభేద దండోపాయంబుల నుపయోగ పఱుచవలసి వచ్చుచున్నది. సామోపాయము నిష్ప్రయోజన మాయెను. దానోపాయము నిరుపయోగ మాయెను. భేదోపాయము కార్యసాఫల్యమునుండి భేదింపఁబడినవి. ఇఁక దండోపాయమే ప్రయోగార్హము. ఎట్లయిన నీకు జ్ఞానోపదేశ మొనర్చుటకు నుత్తమమార్గము కారాగారప్రవేశమే సుమీ! ఇఁక గాలము మించిన దనుకొని చేయునది లేదు. యోచించుకొనుము.

నేతా—(ధైర్యముతో) ఏమీ! కారాగార వాసంబని పలుమాఱు బెదరించి, మనోధైర్యముఁ బాఱఁద్రోల నూహింతువా? దూషణ భూషణంబులు శరీరంబునకేగాని, యాత్మకు గావు. దేశభక్తిగల మెట్టివాసికైనను నీ శిక్షలు బాధాకరంబులు కాఁజాలవు.

సీ॥ చెఱసాల లివిగావు ♦ చెలఁగి ధైర్యమ్ము జ్ఞా
నమ్ముఁ దెల్పెడి భవ ♦ నాలు గాని
బేడీలు గా విివ్వి ♦ తోడ్తో సంగుచు కీర్తి
దార యిచ్చెడి బిగు ♦ దాలు గాని
రాగిసంకటి గాదు ♦ రహిమీఱఁ జిరజీవి
తం బొసంగెడు నమృ ♦ తంబు గాని
శిక్షలు గావివ్వి ♦ చెలఁగి హైందవశక్తి
లక్షించునట్టి ప ♦ రీక్షగాని

గీ॥ కానఁ జెఱసాల యనఁగ లె ♦ క్కయనుకొనక
దృఢమనీషా ప్రతిజ్ఞను ♦ దేజరిలుచు
దేశమాత స్మరించుచు ♦ దీక్షఁబూను
ధీరులగు వారు మహారాష్ట్ర ♦ వీరవరులు॥

దుర్గా—సీచా! ఇంకను కొన్నిదిన ములలో నీ గర్భమున గల విషమునంతయు వెడలఁగ్రక్కుము. నిన్ను వెంటనే బాధీకృతు మొనర్చెద. (భటుల నుద్దేశించి) సైనికులారా! ఈ విశ్వాసశూన్యుని వెంటనే యథాస్థానమ్మగు కారాగారమునకుఁ జేర్పుడు.

ఉ॥ కత్తుల బోనుకన్న నధి ♦ కమ్మగు మా చెఱసాలలోన, ని
న్నొత్తిడిఁ బెట్టకున్నఁ దగు ♦ నుత్తరమీయవు, సాయమీయ నీ
చిత్తము నిన్నొడంబడగ ♦ సేయదు, జ్ఞానము రాదు నీకు, నీ
రిత్తవచో నికాయ మొన ♦ రింపఁగ నేర్చునె; వాంఛితార్థముల్॥

నేతా—గీ॥ ఒకఁడ నేయంచు నూహించు ♦ చుంటివేమొ
వేనవేలుగ దేశాభి ♦ మానులుండ
నెందఱిసి నిట్లు చెఱసాల ♦ యందునునిచి
శిక్షసేతువొ! నేను చూ ♦ చెదను గాక॥

[భటులు ప్రవేశించి బంధితుఁ జేసికొని పోదురు.]
(తెరవ్రాలును.)

---

## చతుర్థాంకము.

### ద్వితీయరంగము.

[పురుషాకృతిఁ దాల్చి గంగాబాయియుఁ గాశీబాయియుఁ బ్రవేశింతురు]

గంగా—సఖా! మార్గాయాసమున మిక్కిలి యలసట జెందినట్లున్నావు. ఎట్లయినను గార్యము సఫలతఁగాంచుననెడు సూచనలు కనఁబడుచున్నవి.

కాశీ—ప్రయాసమున కేమిలెమ్ము. కొలఁది కాలము విశ్రమించినఁ దీరును. కార్య సాఫల్య మొనగూడినచోఁ గష్టములు గట్టెక్కినట్లే యగును. లేకున్న నీ కాయక్లేశము మనోక్లేశము నభివృద్ధిఁ బఱచు. శక్తివంచన లేకుండ నొనర్చు ప్రయత్నము లేల జయప్రదంబులు కాకుండు? ఈ రమణీయ తరంబగు శిబిర రాజ్యమెవ్వరిదై యుండనోపు?

గంగా—మిత్రా! ఈ శిబిరమెవ్వరిదో శ్రీమంతులదై యుండవచ్చును. నా చెలికాఁడగు సఖారాముని భవనమాయని సందియము పొడముచున్నది. కాని యాతని కీ వైభవములు మున్నున్నట్లు లేవు.

కాశీ—మన యిరువురకును సందేహముగనే యున్నది. ఈ వైభవములు క్రొత్తగా నితని కేల లభించి యుండఁ గూడదు? ఆ వచ్చు యావనుం డెవ్వండై యుండు?

గంగా—ఆతఁ డెవ్వఁడైననమన కేమి? మనప్రస్తుత సంశయమునివర్తించుట కతఁడాధారుఁడగును ఆతఁడును మనవైపే కేయరుదెంచెడి. (ముందునకు నడచును)

(సఖారాంకుమారుఁడు తులసీదాసు ప్రవేశించును)

కాశీ—అయ్యా! తమ రెవ్వరో మే మెఱుంగనగునా?

తులసీ—నాపేరు తులసీదాసని యందురు. తమరీ యూరికి నూతనుల వలె నున్నారే?

కాశీ—అవును. నిశ్చయమే.

తులసీ—గీ॥ అయ్యా! మీపేరు? నామధే • యంబదేది?
ఈ పురమ్మున కేతెర • హేతువేది?
కాశీ— దూర దేశమ్మెమాది, మా • యూర గొంత
కార్యముండియె యిటకు రాఁ • గాఁగతంబు
తులసీ— ఆ గతోద్యమము సఫల • మాయెనేమొ?
ఎటుఁగఁ గోరెద మీకు నే • హేతుఁడనగుచు
గంగా— మేము కనఁగోరెదము సఖా • రాముఁడనెడు
శిల్పియతని గేహముమాకుఁ • దెల్పు సఖుడ!

నాయనా! ఈ మాత్రము సాయ మొనర్చిన నెంతయుఁ గృతజ్ఞులము.

తులసీ—(వికాసముగ) ఓహో! సఖారాముగారా! వారే మాజనకులు. పోవుదము రండి.

కాశీ—అట్లా అకనుపట్టు భవనమే గదా?

తులసీ—చిత్తము.

కాశీ—(గంగాబాయినుద్దేశించి) సఖా! మనమనుకొన్నట్లే యయినది సుమా.

గంగా—ధన్యులము. (నిష్క్రమింతురు)

(అవనిక జారును)

[సఖారాముఁ డేకాంతమున నుండఁ గుమారుఁడు కాశీ గంగల యాగమనముఁ దెల్పును.)

తులసీ—తండ్రీ! అభివందనము నొనర్చువాఁడను.

సఖా—కళ్యాణమస్తు. వత్సా! విశేషములేమి?

తులసీ—ఎవ్వరో తమ మిత్రులట, దర్శనంబు నపేక్షించు చున్నారు.

సఖా—కుమారా! జాగు సేయక లోనికిఁ బంపుము.

[తులసీదాసు - కాశీ గంగాబాయిల ప్రవేశము.]

సఖా—(ఆసనము నుండి లేచి నూతనులకు యుచితాసనంబు లొసంగి) కుమారా! నీ కేమైనఁ బనియున్న వెడలవచ్చును.

తుల—[వెడలును]

గంగా—సఖా! ఆర్యవర్యా! తమకు మాకును జిరపరిచితిమే గలదు. గాని ప్రస్తుతాగమనమున మా వృత్తాంతము బహిరంగముగ జెప్పకున్నచో గుర్తింపఁజాలరు.

సఖా—నాకును మీరు పరిచితు లనియే యూహా కలుగుచున్నది.

గీ॥ ఎచ్చటో చూచినట్టు లూ ♦ హింతుగాని
తమ మొగములు చిరపరిచి ♦ తములె యగుట
ఎవ్వరో మీరటంచు గ్ర ♦ హింపలేమి
నొచ్చి మనమందుఁ గడుచిన్న ♦ పుచ్చుకొందు.

గంగా—సుహృద్వరా! గోడలకుం జెవు లుండునను నట్లు మా ప్రచ్ఛన్న వేషమ్ము లితరు లెఱింగినచోఁ గార్యము చెడును. మమ్ములను మీరలు స్పష్టముగా గుర్తింపఁ జాలనందున యావ ద్వృత్తాంతమును లిఖిత పూర్వకముగాఁ దెలుపుట కంగీకృతిఁ జూపుఁడు.

సఖా—నీ యాలోచన ప్రశంసనీయముగనే యున్నది.

గంగా—(ముందు వెనుకలఁ బరికించి దృష్టిసారించుచు కాగితమున వ్రాసి చూపించును.)

సఖా—(కాగితమును గ్రహించి చక్షురక్షర సంయోగము నొనర్చి ఆశ్చర్యమున) ఓహో! మీరా! నా ప్రియసఖులు, చిరపరిచితులు, బహిఃప్రాణములు. ఎన్నాళ్లకెన్నాళ్లకుఁ బునర్దర్శనంబు గలిఁగె. నేఁడు గదా నా జన్మము ధన్యమాయెను!

ఉ॥ ఎన్నఁడు రానివార లిపు ♦ డేటికి వచ్చితిరయ్య? చెల్మికిన్
వన్నెయు వాసియున్ గలిఁగెఁ ♦ బావనమయ్యె గృహమ్ము కారణం
బెన్నఁగ రాదు నాకు, వచి ♦ యింపుఁడు కార్య మేదేనియున్న నే
గ్రన్ననఁ దీర్చివత్తు చెలి ♦ కాఁడ, కృతజ్ఞుఁడనై చెలంగెదన్॥

మిత్రా! భవదాగమన కారణం బెఱింగింపుము.

గంగ—ఆగమన కారణం బేమున్నది! ఏ తన్నగర నివాసుండవై, నిరంతర రాజ్య పరిపాల కాభ్యంతర శిల్పకళావిశారదుండవై, ప్రపంచానుభవంబు గలిగిన వాఁడవయ్యు, విశేషమ్ముల మమ్మడుగ వలయునా? ఏమో మిత్ర వాత్సల్యమున నడుగు చున్నావు కావున సంగ్రహముగఁ జెప్పఁ దలఁచి యున్నాను. కలఁడు గదా! స్వామికార్య ధురంధరుండును, అకుంఠిత బాహు పరాక్రముండును, నిరుపమాన జితశాత్రవుండును, నుదారస్వభావుండునగు మదీయ సోదరుండును, నేతల్లలనాలలామ ముఖ పంకేరుహ ప్రభాత ప్రభాకరుండునై, వాణీబాయిభీమాజీల సత్పుత్రుండగు నేతాజీ - ఆతఁడు మా కర్మవశమ్మునను, మా దురదృష్టము వలనను ............ [చెప్పఁబోవును].

సఖా—(చెవులు మూసికొని) ఆహా! తెలిసినది. ఈ కర్ణకఠోర వాక్కులచే శ్రవణపుటంబు లిదివరకే యవిసిపోయినవి. తగిన సాయము లేనివాఁడనై చేయునది లేకఁ జింతించుచుంటిని. ఆతని విషయమునఁ దగిన ప్రయత్నములు శక్తివంచన లేక జరుపవలయు నని దృఢాభిప్రాయము కలదు.

గంగా } కాశీ } (ఏక కంఠమున) అదియే! మాయభిప్రాయమును. ఆతని ప్రస్తుతస్థితి నేమైన నెఱింగియున్నచో వినిపించి యించుక దుఃఖ శాంతిఁ గలుగఁ జేయుఁడు.

సఖా—ఆతనిఁ గూర్చి యిప్పటి స్థితులఁ జెప్పినచోఁ దమ మనోదావానలము మిక్కిలి ప్రజ్వరిల్లఁ జేసినవాఁడ నగుదునేమో యని సంశయించుచున్నాను. అయిననుఁ జెప్పెద. ఆతని నిప్పుడు నిర్బంధ విధానమున నుంచియున్నారు. ఉచ్ఛ్వాస నిశ్వాసంబుల కంతయు నొక్కటే ద్వారము. దానఁ బ్రవేశించువాయువే యానిర్దోషికి, నిశ్చలునకు, మన నేతాజీకిఁ బ్రాణప్రదమై, యాతని వైరికుల కళంకుల శిక్షాతిరేక పాత్రునొనర్చుచున్నది.

గంగా—దూరమున నుండి చూచుచు విలపించిన నేమి ప్రయోజనము? చేనైన సాయమొనరించుట మేలుగదా. ఇందు నీయభిప్రాయ మేమందువు?

సఖా—జాగు సేయుట కూడదు. నానిశ్చయము వినుడు.

శా॥ ఆలస్యమ్మమృతం విషమ్మనుచు నా ♦ ర్యశ్రేణి బోధింప మీ
రేలా! జాగొనరింప నిప్పుడిపుడే ♦ యేగంగ బాధీకృతుం
డై లావుఁ జెడి నిస్సహాయుఁడయి దై ♦ న్యస్వాంతుఁడై యుంటచే
నాలాగైనను దద్వియుక్తినొకటూ ♦ హింపంగ మేలయ్యెడిన్

గంగా—ఆరీతినే యొనర్తుము. కాని యింకనొక్కమనవి.

సఖా—అవశ్యమువినిపింపుము.

గంగా—సోదరవియోగ శోక సంతప్త చిత్తనగుటంజేసి యూహాలు సవ్యముగ బ్రసరింపక వాంఛితకార్యఫల భంగమొనర్చు నేమో యను జంకుచే మనస్సు శోకాకులంబై చీకాకొనర్చుచున్నది. ఇంతకును విన్నవించు నదేమన మీరుపురుషులగుటఁ జేసియుఁ బ్రాపంచిక సుఖదుఃఖ వ్యవహార పరిచితులగుట వలనను, వయోవృద్ధులగుటంబట్టియుఁ దమరాక ద్రికరణశుద్ధిగఁ గాంక్షించుచున్నాము. వచ్చినచో సమయస్ఫూర్తి మెలంగి కార్యాచరణులమై సఫలీకృత మనోరథులమై యథాస్థానములకుఁ జేరుకొనవచ్చును. తమనామ స్మరణమే మమ్ముల కృతజ్ఞులఁ జేయఁగలదు. అనుగ్రహింపవలయును. అంగీకారమునకై యెదురుచూచుచున్నాము.

సఖా—సఖులారా! ఇంతగఁ జెప్పవలయునా? మీయభీష్టమిట్లో యారీతినే కావింతును. తప్పక మిమ్ముల వెంబడింతు. అకాలమగుట జేసి భోజనానంతరము పయనము సాగింతము రండు.

(నిష్క్రమింతురు)

తెర వ్రాలును.

---

## చతుర్థాంకము.
## తృతీయరంగము.

---

(ఉద్యానవనము - మంజుభాషిణి, చెలికత్తె)

మంజు—చెలియా! వాసంతికా చూచితివా ఈవనమనోహర రామణీయకంబు.

వాసం—అమ్మా! ఇయ్యది ఋతువతంసమనంబరగు వసంతముగదా! అట్టియెడఁ బ్రశస్తతర శోభావిశేషంబుచేఁ జిత్రవిచిత్రవర్ణ భూషణాద్యనేకాలంకృతయై, వనలక్ష్మి లోకోల్లాసకరుండును. నిజమనోవల్లభుండునగు వసంతుని నెదుర్కొనుటయం దబ్బుర మేమున్నది.

మంజు—అంతయు నబ్బురమే. మనోహరవియోగ సంతప్తచిత్తయై, తత్పునరాగమ దర్శనంబునఁ బుష్పితవదనారవిందయైనఁ బతివ్రతా తిలకంబువోలెఁ గన్పట్టుచుండుట లేదా. ఇంకను నొకవిశేషముగలదు.

గీ॥ వరవసంత మనోహరుఁ ♦ డరుగుదేర
రాచిలుకవాలు పచ్చతో ♦ రణముఁగట్ట
శారికావ్రాతములు చెప్ప ♦ స్వాగతంబు
నెదురుకొనుచుండె వనలక్ష్మి ♦ యదిగొ విభుని.

వాసం—సఖీ! బాగుగా వర్ణించితివి. ప్రకృతి ప్రతిమఁజిత్రించితివి. మఱియు నవలోకింపుము. అదిగో! భ్రమరనిచయంబులు మంజులానూనగాన మాధురీసుధారసధారలఁ గ్రోలుచు, మకరంద ధారానందోహ వర్ధితాపార కేదారంబుల విహరించుచు నితాంతసంతోషస్వాంతలయ్యెడి.

మంజు—సఖీ! ఈవనవైభవము నాలుగువైపులఁ బరికింతము రమ్ము.

వాసం—ఇచ్చటే నాకానందముగ నున్నది.

మంజు—ఇచ్చటనే యింతమనోరంజకముగ నున్నప్పుడు, తక్కిన ప్రదేశముల నెట్లుండునో యవలోకింపఁ గుతూహలివిగావా? అల్లదిగో! కలకంఠనిచయంబులు. ఆహా! వాని సౌఖ్యమేమని కొనియాడందగు. చేతనా చేతనంబులెల్లను వసంతుఁడు జగదానందకరుం డనుమాట

నెక్కువకాంక్షించుచున్నవి. ప్రశస్తతర నిస్తులకిసలయ విసర విరాజిత రసాలసాల శాఖాసీనంబులై, ఖాదితారుణ కోమల పల్లవంబులై యపారానంద పారావార రంగత్తరంగ మాలికాడోలికా చాలితంబులై, పాంథవ్రాతంబుల నిజావ్యక్తకలకంఠ మాధురీగానఁ కుహూ కుహూ కూజితంబులఁ బలుకరించుచున్నవిగదా.

వాసం—నీవు కలకంఠివి గావుననే కలకంఠంబులు నిన్నే పలుకరించుచున్నవి. గనుక నాదెసకు విసవిసఁబోవుదమురమ్ము. నీయుత్సాహముమాత్ర మేలకాదన వలయును.

(కొంత ముందునకునడచి).

మంజు—(ఇంచుక నాలకించుట నభినయించి) కలికీ! ఇచ్చటనెవరో పాడుచున్నట్లున్నది. ఆలకింపుము.

వాసం—(అభినయించి) నిశ్చయమే

మంజు—ఈకంఠస్వర మెవ్వరిదైయుండు? ఈనిర్జనోద్యానంబునఁ పాడుటకుఁ గారణమెద్ది?

వాసం—అమ్మా! మఱచితి. ఈకాలిత్రోవ యొక కారాగృహమ్మునకుఁ గొనిపోవు. అచ్చటఁబనిసేయు తాపీవాఁడుకాఁబోలు పాడుచున్నట్లున్నది.

గీ॥ ఒంటిపాటునఁ బనితోచ ♦ కున్న వేళఁ
గాయకష్టంపు పనికినై ♦ గడఁగువేళ
డెందమత్యంత సంతసం ♦ బందు వేళఁ
గానరాగము సర్వలో ♦ కుల గుణమ్ము.

మంజు—అవునా. ఆతఁడచ్చటేమి చేయుచున్నాఁడు?

వాసం—సఖీ! అదియంతయు గర్భ నిర్భేదకరవార్త! ఆ విషయంబుల నన్నుఁ బ్రశ్నింపవలదని వినయపూర్వకముగఁ దమదయనుఁ బ్రార్థించుచున్నాను. (అని యశ్రుకణంబుల రాల్చును).

మంజు—చెలీ! ఏలనీవింత జేలవై కన్నీరు రాలఁజేయుచున్నావు? విషయమునుఁ జెప్పుము. చర్చనీయాంశమైన భావిప్రయత్నంబు లోనర్తము.

వాసం—అమ్మా! అదిఘోరకలి! చెప్పుటకు నోరాడుటలేదు. అడుగు చున్నావు గనుక చెప్పెదను. రాజద్రోహి యనెడు నేరము మోపఁబడిన మహారాష్ట్రశూరాగ్రేసరుండు నిస్సహాయుఁడై, యాకారాగారమున బంధితుఁడై యున్నాఁడు. నియమితదినంబులలో వశపడకున్న నాతఁడచ్చటనే మరణింపవలయునఁట. గడవు దినమును సమీపించుచున్నది. ఉచ్ఛ్వాస నిశ్వాసంబులకు ననుకూలముగ నున్న యాచెఱసాలయందలి నవరంధ్రములు దినమున కొక్కటి వంతున మూయఁబడుచున్నవి. పాపము! మరణమాతనికి సిద్ధమే కాఁబోలు. రంధ్రములు మూయుచు రాంజీపాడుచుఁ బనిచేయు చున్నాఁడు.

మంజు—ఔరా! ఎంతటి క్రూరకృత్యము. మితిమీఱిన ద్రోహమే యొనర్చియున్న నేల శిరచ్ఛేదనము విధింపరాదు. ఇంతబలవంతముగ ప్రాణముఁ దీయుటయా? ఎంత ఘోర మెంతఘోరము! ఈతని నేర మేమిరో యెఱుంగుదువా?

వాసం—ఏమియులేదు. జాతిమతదేశంబులపై భక్తివిడనాడి బీజాపూరు వారికి సాయమీవలయునట. అందున కాతఁడంగీకరింపకఁ బోవుటయే గొప్పనేరము. ఇఁక నేమి కావలయును?

మంజు—నీవు సత్వరమ యేగి, రాంజీని నిచ్చుటకి రమ్మని చెప్పుము.

వాసం—చిత్తము. (నిష్క్రమించును).

మంజు—(దీనాననయై) ఛీ! పాపిదైవమా! అబలనగు నాకేలనీవగపుఁ గలిఁగించెదవు? ఖైదీకివిడుదల నిప్పింప నాచేతనగు పనియా? రక్త బంధువులే యెన్నోవిధముల లాలించినను విననివాఁడు నామాట మాత్ర మేలవినును? అయినను జన్మదేశమందును, జననియందును భక్తి యెవనికుండదు? ఇదియుఁ గోపకారణ మాయెఁగాఁబోలు.

ఉ॥ ఈతఁడు జన్మదేశమున • హెచ్చుగ భక్తి వహించి, వైరి రా
ద్ద్రోహము తన్ను నెంత బల • వంతము పెట్టినగూడ, వారి దు
శ్చేతమెఱింగి, సాయమును • జేయని హేతువుచేత నాప్రియుం
డీతటి బందిఖాన వసి • యింపవిధించెదు వీని నక్కటా॥

ఛీ, ఏటి కీపలవింపు? అబలాచాపల్యమువలన నిట్లనుచున్నాను. గాని, వీసమైనను నా మనో పరితాప దవానలంబును శమింపఁజేసి కొనఁ గలుంగుదునా?

ఉ॥ ఊరకఁ జింతఁజేసినఁ బ్రయోజన మేమియులేదు, కార్య పుం
భారముఁ దాల్చి; యత్నము క్రమంబుగఁజేసి ఫలాంకురంబునుం
గోరుట యొప్పు; నూరకొనఁ గూడునె తత్ఫలసిద్ధి గాలిలో
నారయ దీపముంచి, వెలుఁగారక నుండుమటన్న నిల్చునే॥

దీనికే యబలావిలాపమని పేరు. అన్నియుఁ దెలియుదును, అన్నియుఁ దెలియవు. వూరకయే యుండమన్నచోఁ శాపమా జేపి పరమపదించును. వీని కష్టదశ నెఱింగియుఁ దద్విముక్తికయి శక్తి వంచన లేకుండ యత్నములం జేయనిలోపముచేత, నాతని ప్రాణాపాయ పాపంబున కొడిగట్టుకొందును. నా చెలికత్తె వాసంతిక యింకను రాని గతంబేమైయుండు?

(వాసంతిక రాంజీతోఁ బ్రవేశించును)

రాంజీ—దేవేరిగారికిఁ దమ పాదసేవకుఁడిదే నమస్కరించుచున్నాఁడు.

(అని తాను గొనివచ్చిన పుష్పము లర్పించి నమస్కరించును)

మంజు—ఏమోయి, మేస్త్రీ! నీ విప్పుడేమి చేయుచుంటివి?

రాంజీ—నేనుకొను వేతనంబునకై దేవరయాజ్ఞల నిర్వర్తించుచుంటి.

మంజు—నిన్నొక విషయమడుగ వలె ననుకొంటిని. సాధారణముగా మహామ్మదీయులు మృతిఁబొందినవారికే గోరీ కట్టుదురు. నీవు హిందువుఁడవై సజీవుఁడైన స్వజాతివానికే సమాధిఁగట్టుచున్నావే? ఈ ఘనకార్య మొనర్చు సంతోషమునఁగాఁబోలు పాడుచున్నావు.

రాంజీ—దేవేరిగారి కేమని జవాబు చెప్పగలను? అధికారుల యాజ్ఞలు నిర్వర్తింప వలసినదగుట వలనను, బాల్యమునుండియు నోరాడినఁగాని చేయాడని స్వభావము గలవాఁడ నగుట వలనను నిట్లొనర్చుచున్నాను.

మంజు—అసంతృప్తిగనా? సంతృప్తిగనా?

రాంజీ—అసంతృప్తిగలిగి నేఁజేయున దేమిగలదు? నా జీవనోపాధి కాధారులగు దేవర కొలువును బరిత్యజింపవలయును.

మంజు— ఆ రీతి నేల నొనర్పవైతివి?

రాంజీ— ఒనర్చినచోఁ దమకుఁ గొదువయా? నావంటి వారలెందరీ నౌకరీకిఁ గాచుకొనియుండరు? ప్రతిజీవునకును జీవనోపాధి ముఖ్యముగదా. ఇప్పటికే యొకొక్కఁడుఁ జేతికిని నోటికిని దూరముగు చుండును. వదలినచోఁ జేయంగలిగెడి దేమియు లేదు.

మంజు—కనుక త్రికరణ శుద్ధిగనే జేయుచున్నావు?

రాంజీ—అమ్మా, చేయుక విధియున్నదా? (అనుచు వాసంతిక వైపు నకుఁ జూచును)

మంజు—ఆ దాసివైపు చూచెద వేల? నీకే యుపకృతియు రాకుండ నాకై దీని విముక్తుఁజేయ యత్నింతువా? చెప్పవలసిన విషయము లున్న భయమువీడి చెప్పుము. అభయ మొసంగితి.

రాంజీ—ఏలిక సెలవు నతిక్రమింపక దాసుల తప్పులు దండముతో సరియన్నట్లు ప్రస్తుతాంశమందు నాకుఁదోఁచిన వృత్తాంతము జెప్పవలయునన్నఁ జెప్పెదను.

మంజు—ఇదివఱకే యేలఁ జెప్పిన వాఁడవుగావు?

రాంజీ—అమ్మా! ఏలనో మీరెఱుంగరా? కారణము సర్వజన సామాన్యము.

ఉ॥ కత్తులబోనుకన్న నధి ♦ కమ్ముగు దేవరవారి సన్నిధిన్
జిత్తము తత్తఱంబడెడిఁ ♦ జెమ్మటలూరెడి దేహమెల్ల, నో
రెత్తిన మాటరాదు, వచి ♦ యించిన నున్న యథార్థమెల్ల, మా
బత్తము పోవునేమొయని ♦ వాయికిఁ దాళము వైచియుంచితిన్

అయినను బ్రస్తుతమున,

తే ॥ గీ॥ అభయమిచ్చితి నంచు మీ ♦ రనుటచేత
జంకు గొంకును లేక మీ సన్నిధికిని
శ్రీముఖమ్మిత్తు దానినిఁ ♦ జిత్తగింప
వలయు విషయమ్ము కరతలా ♦ మలకమగును.

అమ్మాళ్—యీ (స్త్రీ) ముఖమును జిత్తగింపుఁడు. (అనుచు నుత్తరమందిచ్చును)

మంజు—(ఆమూలాగ్రముగఁ జదువుకొని వికసితముఖారవిందయై) ఔరా! ఎంతటివాఁడవు! ఎట్టిమహోపకృతిఁ గావించితివి! చిరకాలముక్రిందనే పీడి, వారల ప్రస్తుతస్థావర మెఱుంగకున్న నాకు నీవలనగదా స్నేహితవియోగాతపసంతప్తమై శుష్కించిన మాస్నేహలతామతల్లులకు దోహద తరుణము నేటికిగదా కలిగినది!

ఉ॥ ఇంతకుమున్ను నీ విషయ ♦ మేమియు ఖైదియొవండొ యంచనన్
సుంతయుఁ జెప్పకుంచుటది ♦ చోద్యము చూపినయుత్తరంబులో
వింతజనించె లేఖకులు ♦ వీరలు నిగ్రహమెట్లు చేరిరో
యంతయుఁజెప[illegible]ము, హృద ♦ యంబునఁ బ్రేమములుప్పతిల్లఁగన్

రాంజీ—అమ్మా! ఈ విషయమంతయు స్వల్పము. నాకును, రాజస్థానశిల్పియునగు సఖారామునకును జిరకాలము నుండియు నేస్తముకలదు. మీరు వచించు లేఖకులు మాస్నేహితుని యింటికి నతిథులుగ విచ్చేసిరి. క్రమక్రమముగా నూతనులకును నాకును మైత్రిపొసఁగినది. తరువాత వారివిషయమై యాలోచింప నాగుండె నీరైనది. కాని వారలకేవిధముగను నుపకృతిఁజేయ నసమర్థుఁడ నగుటచే విని జాలినొందుచుండెడివాఁడను. అటుపై నొకనాఁడు వారిలో నొకరు నాచేతికి లేఖ యిచ్చిరి. అయినను ధైర్యసాహసములు లేని వాఁడనగుటచే నేమిచేయుటకును నశక్తుఁడనై లేఖ దాచియుంచితి. నేడు దైవవశమున దేవేరివారిచిత్తము సేవకుని ప్రాప్తమన్నట్లు వెలువరింప నవకాశముగలిగినది. ఇదియే దీనివిస్తరము. నావచోనిచయంబుల దోసంగులు పొసంగియున్న క్షమింపఁ గోరుచున్నాఁడను.

మంజు—రాంజీ! భయపడనవసరము లేదు. అభయమిచ్చితి నంటిగదా. బంధితునకువిముక్తినిప్పింప యత్నింతము. కర్తవ్యమాలోచనీయము.

రాంజీ—తల్లీ! కర్తవ్యము విశేషచింతనీయముగాదు. భావిప్రయత్నంబు లిదివఱకే చేసియుంచితిని. ఆకారాగృహమందు నొకజిడ్డుత్రోవ నేర్పఱచి యుంచితి. దానినుండి బంధితునిఁ దమబోటి దయాస్వరూపులు వెలువడ నీయవచ్చును. కార్యానంతరము మార్గము మూయవచ్చును.

మంజు—రాంజీ! నీ దూరదృష్టి మిక్కిలి ప్రశంసనీయము. భవిష్యదాలోచనలు నిదానముగా జరుపుదము.

రాంజీ—చిత్తము పోయివచ్చెదను.

(నిష్క్రమింతురు)

---

అవనిక వ్రాలును.





# కాశీవిజయము

## పంచమాంకము

### ప్రథమరంగము.

రంగము.—నేతాజీ కారాగృహమున నటునిటుఁ బచారు సలుపుచుఁ గాలికిఁ దగిలిన యొక యుత్తరము నందుకొని చదువుచుండును.

నేతాజీ—(స్వగతము) ఆహా! నేఁడు నాకు బృహస్పతి పదునొకండునై యున్నాఁడు. అగ్రాహ్యమగు నొక నూతన సంతోషము నా హృదయమును సంచాలిత మొనరించుచున్నది. ఈ యుత్తర మెవరిదై యుండును? ఇందలి విషయము లాలోచింప నా శ్రేయోభిలాషిణి యగు నా సోదరియు, నాకుఁ దోడునీడయగు నా బహిఃప్రాణము నా విముక్తికై ప్రయత్నించుచున్నట్లు సారాంశమైయున్నది. ఇదియంతయు విశ్వాసనీయమగు సంశయమే యగునా? ఏల కాక పోవును? 'ధర్మమేవజయతి' యను నార్యోక్తి నిస్సారమగునా? ద్రోహినని నేను నిర్బంధింపఁ బడలేదుగదా. దైవసహాయమున నేఁటికీ శుభసూచనలు గలుగుచున్నవనుకొనెదను! ఇంత చర్చయేల? ఈ శ్రీముఖ ప్రకారము నాకీ రాత్రికేగదా సాయము సిద్ధపడవలయును! నాకీ తత్తఱ మెందులకు? నాహృదయ దౌర్బల్యమునకు నించుక శాంతిఁ జెప్పుకొనియెదను.

గీ॥ కుసుమకంబోవుచుఁ ద్వరపడి । కూఁటి పుచుల
నడుగ నేఁటికి? నీకొఱకై । గడియలోన
నరయుగానాను కార్యజ । యా జయములు
త్వరపడెద వేల? హృదయమా । తగదునీకు॥

గగనభాగంబంతయు భీకర మేఘనాదంబులఁ బ్రతిధ్వనించుచున్నది. దిక్తటంబులన్నియు గాఢాంధకార బంధురంబులైనవి. దుర్గాధ్యక్షుఁడును వచ్చిపోయెను, ఈయకాలమున్నన నడుగులు చప్పుడు వినవచ్చుచున్నదే! ఎవరో వచ్చుచుందురు?

[రాంజీ ప్రవేశించును]

రాంజీ—నేతాజీ! మహావీరా! నేను రాంజీయను వాఁడను. నిన్నటి సాయంసమయమున నీకందనట్లు పడవైచిన యుత్తరమందలి విషయములు చదువుకొంటివిగదా! మిక్కిలి జాగరూకుండవై నేఁజెప్పు విషయము లాలకింపుము.

గీ॥ పటపటారావ మొక్కటు । ప్పతిలు నిపుడె
గుండె నిబ్బరము వహించి । యుండుమయ్య
వీలుఁగను వెంట నాగ్నేయ । మూలయందు
మెలకువను గల్గి తప్పకో । వలయు మిత్ర॥

నేతాజీ—జాగ్రత్తగనే గమనింపుచుందును.
రాంజీ—వీరాగ్రేసరా! హుషార్.

(పెద్ద కలకల మగును)

(నేతాజీ బయలువెడలి రాంజీని గలిసికొని వచ్చును.)

[మంజువాణీ వాసంతికల ప్రవేశము.]

మంజు—చెలీ! మన ప్రయత్నము సఫలమైనట్లున్నది.
వాసం—మనమును వారిని గలిసికొందము రమ్ము.

[రుస్తుం జమాను ప్రవేశము.]

రుస్తుం—(దిక్కులు పరికించి) ఆవచ్చువారెవరు? నా ప్రేయసియూ, వాసంతికయుఁ, బరపురుషులతో వచ్చుచున్నారు (గంభీరహుంకారంబొనర్చి) విశ్వాసఘాతకులారా! జ్ఞానలవదుర్విదగ్ధులారా!

కంఠకావరముచే మిన్ను మన్నెఱుంగక ముందు రాబోవు చిక్కుల నరయఁజాలక స్వేచ్ఛావృత్తికిఁ గడంగితిరిగా? ఏమీ? మీగుండె నిబ్బరము. ఈ బంధితు నెట్లు వెలుపలకుఁ దీసితిరి? ఔరా! కొంపకుఁ గొఱవిఁ దెచ్చి పెట్టుకొంటినే! దుర్మార్గులారా! ఇదిగో కాచుకొనుఁడు. నా నిశితకరవాలమున నొక్క వ్రేటున మృత్యుదేవతా క్షుధానలజ్వాలల కాహుతు లగుటకుఁ గాచుకొనుఁడు? యమపురప్రయాణమునకు సంసిద్ధులు కండు. రాంజీ! మా కనుసన్నల మెలంగ వలసిన వాఁడవు నీవును ద్రోహమునకుఁ బాల్పడితివిగా.

॥ ఓరీ! ఎట్టిడవోయి! ఒంటిగ దుష ◊ ద్యోగమ్ముఁ గావించి, వి
స్తార ప్రక్రియ బంధితుండయిన రా ◊ జద్రోహియా ఏనికిన్
గారాగారవిముక్తి నెట్లొసగితో? ◊ కాపాడుకో ప్రాణముల్
ఘోరాసిన్ దవకంఠలుంఠనముచే ◊ క్షోభించు కాలమ్మునన్ ॥

[ కరవాలము ఝళిపించును].

మంజువాణి—(ఆతని పాదములపై వ్రాలి) నాథా! ఏల మీ రింతగా కోపోద్దీపితు లగుట? ఈతఁ డెవ్వరో యన్యుఁడను కొంటిరా! అబల నగు నేను తప్పిదమే చేసియున్న మీరు వారింపఁ దగరా? నిర్హేతుకంబుగ నేల నీ వృథాగ్రహము.

గీ॥ బంధితుఁడు మీకు ముద్దుల ◊ బావమఱఁది
కర్త దేవరకును సేవ ◊ కప్రవరుఁడు
కారయితే నేను తమ మనో ◊ హారిణి గద
పరు లెవరు మీకు నిందులోఁ ◊ బ్రాణనాథ॥

నాథా! ఈ యొక్క జీవికిఁ బ్రాణదాన మొసంగినచోఁ దమకు శాశ్వతసౌఖ్యంబులు దైవంబు ప్రసాదించు గాత. కోపాటోపముమాని శాంతభావము వహించి యబలావిలాపంబు నాలకించి యొక్కైనను ధన్యురాల నొనర్పఁ బ్రార్థితులు. ఆశ్రితుల రక్షింపుఁడు. పిచ్చుకపైననా బ్రహ్మాస్త్రము?

గీ॥ దానములలోన మేటి ని ♦ దాన మొకటి
అందునను బ్రాణదానంబ ♦ యతులితంబు
శాస్త్రసమ్మతమైన ప్ర ♦ శంస గాన
జెలియ భాగ్యమ్ము దేవర ♦ చిత్తమింక.

రుస్తు—ఔరా! చెలియా! ఎంతటి మాటకార్తివైతివే.

ఉ॥ ఎన్నఁడు నేర్చితీ వెలుకు ♦ లీవినయాభినయానుకూలతో
త్పన్నమృదూక్తిమాధురి, స్వ ♦ భావవిలాసములై చెలంగ, స
ర్వోన్నత సన్నుతార్హసమ ♦ యోచితబుద్ధిప్రకాశమియ్య నా
కన్నులకద్భుతీరఁ గనఁ ♦ గల్గితి నేఁడు గదా తలోదరీ॥

కాంతా! నేర్పరి తనమంతయుఁ బ్రహ్మ నీసొమ్ముగాఁ జేసినాఁడు. ఎంత కోపోపశాంతి నొనర్చితివి!

గీ॥ తప్పుపనిఁ జేయుటన నసా ♦ ధ్యమ్ముగాదు
కాని లోకమ్ము కనుఁగొనఁ ♦ గల్గనేని
వెలికి రాకుండ సక్కట ♦ కుక్కలనుజూపి
గోడనిడినట్టు లనృతంబు ♦ లాడవలయు.

ప్రేయసీ! లెమ్ము.

మంజ—మనోహరా! అభయ మొసంగి నాముద్దుచెల్లించు వరకుఁదమ పాదముల వీడఁజాలను.

రుస్తుం—అభయమిచ్చితిని, లెమ్ము. ఇస్సీ. ఇంతమాత్రంబునకే యింతటి జేలవు కావలయునా? ఏమియు భయములేదు. నేను నీకుఁగాక మఱియెవరికి, కోరిక లీడేర్పఁగలను? కాని నాకు రాగల ముప్పునైనఁ దలంపకయే నీపీ కార్యమున కొడిగట్టుటయే గొప్పతప్పు. ఈవిషయమును వెలికి రాకుండఁజేసి కొనవలయును. సుల్తానునకీ యుదంతంబు తెలిసినచో నాకు జరుగనున్న భవిష్యజ్జీవనోపాధి యధఃపతితమగును కావున ప్రేయసీ నా పలుకులు కూడను నీవు వినవలయును.

మంజ—(నిలుచుండును). సరియే! అట్లే వినెదను.

రుస్తుం—శూరవరా! నేతాజీ! నీవును నాస్థితి గమనింపుము. నీవిచ్చట నున్నచో నిన్ను మేము వదలునట్లు, మీచేతిచేఁబట్టుబడిన నాయూ ఖుఖానుని శ్రీశివాజీ విడుదల నొనర్చునట్లును నే నేర్పాటులఁ గావింపనెంచితి. దీనికేమైన శివాజీ యభ్యంతరము నుండునా?

నేతాజీ—నాకై యాతఁడెద్దానికైన సిద్ధుఁడే. దైవవశమున నాప్రస్తుత పరిస్థితు లతని కగ్రాహ్యము లగుటఁజేసియుఁ, గాన్యాతురుండై యుండుటవలనను నూరకుండెను. గాని నావిముక్తి కాతఁడేల నభ్యంతరముఁజెప్పును? అవశ్యము మీప్రయత్నములఁ జేయుఁడు

రుస్తు—బావా! నావిన్నప మాలకింపుము. అపాయములేని యుపాయము. ఆగ్రహింపకుము. నీవెప్పటియట్ల యీరాత్రికూడఁ గారాగారముననే గడపుము. ఉదయముననే యీకోట స్వాధీనపడును. సుల్తానుగారి యాజ్ఞవచ్చువరకు విడిఖైదీగా నుంచెదను. నామనవి విని యథాస్థానమ్ము నలంకరింపుము. నీవిముక్తికై నేనాలోచింతును. ద్రోహబుద్ధియని మాత్రము తలఁపవలదు. (రాంజీనుద్దేశించి) రాంజీ! మాబావగారి నెప్పటియట్లు యథాస్థానమునకుఁ జేర్చి, చేసిన తప్పు తెలియకుండునట్లొనర్చి, రంధ్రముల నిటుకలచేఁ బూడ్పుము.

రాంజీ—చిత్తము.

నేతాజీ—నీమాన ప్రాణములకు నపాయము నేనేల గోరెదను? నీ యిష్టప్రకారమే కావింపుము.

శా॥ బావా! అట్లయొనర్తు యత్నమునలో ♦ పంబేమియుఁ జేయక
నీవాక్చాతురి నచ్చిమెచ్చఁదగు భం ♦ గిన్ జెప్పి సుల్తానుతో
నీవీసాయమొనర్చి, యెల్లరను నం ♦ దేగాని నీచట్టు నా
సావాదిత్యముఁ జేయనైన సరిపో ♦ ల్పన్ రామి చాటన్ వలెన్.

రుస్తుం—నాకే చింతగనున్నది. నానమతుమునఁగూడ, నీస్థితిఁగనులార నెట్లుగాంతును? సిగ్గగుచున్నది.

రాంజీ—ప్రభుసత్తమా! కన్నీరిడిన లాభమేమి? వాగ్దానముఁ జెల్లించుటయే శౌర్యలక్షణము. నేతాజీ! నీకింకను బంధవిముక్తి దైవప్రేరితము కాలేదు కాఁబోలు.

గీ॥ అలఘు సుఖదుఃఖములు మాన ♦ వులకు నెల్లఁ
గాల పరిపాక వశముచేఁ ♦ గలుఁగుచుండుఁ
బురుషయత్నంబు లెన్నని ♦ జరుపుచున్న
ననుభవము దప్పదెట్లు క ♦ ర్మైకఫలము॥

శ్రద్ధవహించి మీమాట నిలుపుకొనుఁడు. (అని యెవ్వటికిఁ గారాగృహమున నేతాజీనిఁ బ్రవేశింపఁజేసి) ప్రభూత్తమా! పోయి వచ్చెదను. (వెడలును.)

రుస్తుం—నేతాజీ! నిన్నుఁ బునర్బంధితుఁ జేయుటచే నేనేమియో కృత్రిమాలోచనలఁ గలిగి యున్నానని యనుకొనకుము. నా ప్రయత్నంబులు సాఫల్యంబు లగును. తప్పక నీకు విముక్తి కలుఁగును.

ఉత్సాహ॥ ఎల్లి యుదయమందు దుర్గ ♦ మెట్టులే జయించెదన్
జల్లగాను మాటకృపుని ♦ సన్నిధిన్ మనంబు రం
జిల్లఁగా వచించి నిన్నుఁ ♦ జెఱనువీడఁ జేసెదన్
గల్లలంచు నెంచవలదు ♦ గట్టిగా నిజమ్మిసూ.

నీకేమియు భయమువలదు. స్వేచ్ఛగలిఁగిన దనియే యనుకొనుము. సూర్యోదయ మగుచున్నది. నను పోయివచ్చెదను.

నేతాజీ—దయయుంచవలయును. సూర్యభగవానుఁ డదిగో నాపాలిటి భాగ్యదేవతవలె నావిపత్పరంపరలఁ బోఁగొట్టు ప్రాణదాతవలెఁ గాలాతీతంబు సహింపనోపకఁ జరచర నుదయాద్రిపై కెగురుచున్నాఁడు.

గీ॥ తూర్పుజవరాలి మోము సిం ♦ ధూరమనఁగ
సాధురక్షణఁ జేసెడు ♦ చక్రమనఁగ
శాత్రవాజ్ఞానతిమిర భా ♦ స్కర మనంగ
భానుఁ డుదయించు దేదీప్య ♦ మానుఁడగుచు.

(తెరవ్రాలును.)

## పంచమాంకము.

## ద్వితీయరంగము.

---

(వేదవంతుఁడు, కాశీబాయి, గంగాబాయి ప్రవేశింతురు.)

రంగము - వేదవంతుని పర్ణశాల.

వేద—కాశీబాయీ! బయలుదేరినందులకు మీ కార్యభారము సఫలమే యొసంగినదా?

కాశీ—ప్రయత్నములు సఫలములైనవనియే యనుకొనవచ్చును.

వేద—మీరు నేతాజీని మీ వెనువెంటఁగొని వచ్చుటకేమి యభ్యంతరము కలిగినది?

కాశీ—రాజకీయ వ్యవహారము వలన నించుక యాటంకము గలిగె. ఆ వ్యవహార మిప్పటికిఁ బరిష్కరింపఁ బడియుండును.

వేద—అయినచోఁ గడవుదిన మెప్పటికిఁ దీరిపోవును?

కాశీ—సుమారు నాలుగు దినములు గడచినవి.

వేద—గడవుగడచి నాలుగు దినములైనను నేతాజీ యిచటికిఁ రాకుండ నేల జాగొనరించియుండును? రాజకీయ కార్యాతురుండై యుంటజేసి, విడుదలయైన వెంటనే ప్రభుభక్తి సూచించుటకై శ్రీశివాజీచక్రవర్తిని దర్శింపనేగి యుండునని నాయభిప్రాయము.

కాశీ—అదియు సమంజసముగనే యున్నది.

వేద—(గంగ నుద్దేశించి) ప్రేయసీ! దీర్ఘాలోచనాయత్తవై యున్నట్లున్నదే? విశేషములు చెప్పక నూరకున్నావు.

గంగ—నాథా! మీసోదరియే విషయములన్నియుఁ బూసగ్రుచ్చినట్లు చెప్పుచున్నదిగదా.

వేద—అందునకా? కాదు. కబురంపించినఁ గూడను దలిదండ్రులేల నింకను రాక నాలసించిరో యని యోచించుచున్నట్లున్నది.

గంగ—అవును. మీ రెఱుంగని దేమున్నది? ఇంచుక నాలకింపుడు ఎచ్చటనో శకటచక్రహతులు వినవచ్చుచున్నవి.

వేద—(యోజించి) అవిగో! అట్లే తోఁచుచున్నది.

కాశీ—అయినచో నెదురేగి కలసికొందము.

గంగ—కం॥ అదిగో! అదిగో! మావా
రిదె వచ్చుచు నున్నవార • లీదెసఁ గనుమా
ఎదురేగి కలసి కొందము
వదవద! మర్యాదసరళిఁ • బరికింపఁగదే.

[అందరును గలసిపోయి, వాణీబాయి, భీమాజీలతోఁ బ్రవేశింతురు]

వేద—(నమస్కరించును.)

భీమా—సుపుత్రావాప్తిరస్తు.

వాణీ—అమ్మాయీ! గంగా! నీవు నాలుగు దినముల క్రిందట వ్రాసిన శ్రీముఖమందలి విశేషముల నరసి, మితిలేని సంతోషాంతరంగులమైతిమి. (కాశీబాయినిఁ జూచి) కాశీ! ఏమి దూరముగా నిలువఁ బడితివి? రమ్మి (ప్రక్కనఁ గూర్చుండఁ బెట్టుకొని) మా నేతాజీ యేఁడీ? ఇచ్చటకు రాలేదా?

కాశీ—ఇంకను రాలేదు. ఇప్పటికే రావలసినది. ఏమి కారణమో గదా!
కం॥ రేపో, మాపో యిటకును
మీ పుత్రుఁడు రాఁ గలుగవి • మేము తలంచన్
మీ పేరటఁ గబు రంపితి
మీ పాటికి రాకఁ దడసె • నేమి కతంబో!

వాణీ—రానందులకు హేతువేమైయుండునో మీరలూహింపఁగలరా?

కాశీ—విడుదలయైన వెంటనే తనచక్రవర్తియొద్దకే పయనమై పోయి యుండునని మాయందఱి యభిప్రాయము.

వాణీ—సహేతుకముగనే యున్నది.

వేద—ఇంచుక నిశ్శబ్దముగ నుందము. ఎచ్చటనో యశ్వపద ఘట్టనంబులు వినఁబట్టుచున్నవి. ప్రాయికముగా మా నేతాజీపినుఁడే యై యుండును.

(అందఱును లేచి, దిశలఁబరికించి, అదిగో శివాజీ చక్రవర్తి వెంటనిడుకొని వచ్చుచున్నట్లున్నది.)

(శివాజీ, నేతాజీ ప్రవేశింతురు. ఆసీనులగుదురు.)

అందఱు — భవానీమాతకీ జేయ్. శివాజీమహరాజ్ కీ జేయ్.

భీమాజీ — రాజాధిరాజ శ్రీ శివాజీ మహారాజా! మీయుపకృతికి మేమెల్లరముఁ గృతజ్ఞులము

శివాజీ — నాయుపకృతియేమున్నది? అంతయు దైవాధీనము. అయినను విశేష మొందుగలదు. మహారాష్ట్రులకును బిజాపురవాసులకును ఘోరసంగ్రామంబు తటస్థించెగదా. అందున శత్రుసేనానియగు అబూఖానుఁడు మాచే బంధితుండయ్యె. ఆతని విముక్తికై తురుష్కులు ప్రయత్నించి యాతనిని వదలినయెడల నేతాజీకి స్వేచ్ఛ నిత్తుమనిరి. అందున కంగీకారము సూచించితి. నాకు బహిఃప్రాణమైయుండుకతన నేతాజీ శ్రేయోభిలాషినై అబూఖానుని వదలించితిమి. అంతట నాకుఁగుడిచేయియై, తలలోని నాలుకయై యొసంగు నీతని దర్శనప్రాప్తిగలిగె. ఇదియే యీతనిస్వేచ్ఛను గూర్చిన సవిస్తరము.

వాణీ, భీమా — (నేతాజీని నక్కునఁ జేర్చి) నాయనా! కుమారా! ఎన్నాళ్ళకెన్నాళ్ళకు నినుఁగనఁగల్గితిమి!

భీమా —

చ॥ నిను విడనాఁడి, నేఁటికిఁ గ ♦ నీసము వత్సర మయ్యెనోయి, ఎం
దున నినుగూర్చి చెప్పెడు బు ♦ ధుల్ గనరాముగదోయి, కాశికిన్
అనుజకు నిద్గతుఁగొను ప్ర ♦ యాసము గల్గెగదోయి, నీదు ద
ర్శనమున మాకు నేఁడుగద ♦ సంతస మబ్బెగదోయి, పుత్రకా!

గంగా — సోదరా! సుకుమార శరీరుఁడవు. నీవా చెఱసాలలో నెట్లుంటివి? కటికశిలాప్రదేశంబున నెట్లు పరుండియుంటివి?

శా॥ తీఱన్ రాని వెతల్ ఘటించిరె కుబు ♦ ద్ధిన్ బద్ధునిన్ జేసి వా
శేరా! యాచెఱసాల నెట్లొదిగితీ ♦ వెన్నాళ్ళనోయుండి, చ
క్షూరాజీవయుగంబు వాచె నిను గ ♦ న్గోమున్కి మీ తావయున్
నీరాకన్ మదిగోరు, సూర్యునికినై ♦ నీరేజ వర్గంబటుల్

సోదరా! నీ కొఱకెన్నెన్ని కష్టములఁ బడితిమి! ఈ శరీరముపై నాసలమాని యెట్లయినను దోడునీడవగు నిన్ను గనుఁగొనుట ముఖ్యోద్దేశముగ భవదన్వేషణంబు నొనర్చితి.

నేతా— సోదరీ! మన మనుకొనిన లాభమేమి? విధినిఁ దప్పింపఁ దరమా! కాని యన్నిటికన్నను నీవుగూడను నా కొఱకై శ్రమ జెందినందులకు గుండె నీరగుచున్నది.

ఆ॥ వె॥ వన్నెవిసన కఱ్ఱ ♦ పలె నిన్ను నిరతంబు
గారబమ్ముతోడఁ ♦ గాంచుచుంటి
గాని కర్మఫలము ♦ కడగండ్లఁ బడఁ జేసె
నేమి చేయఁజాల ♦ దీశ్వరాజ్ఞ!

కాశీ—(నాథుని సమీపించి) హా! నాథా! నేఁ డెంత సుదినము! ఎన్ని కష్టములైనను గార్యసాఫల్యమైనచో నత్యమిత సంతోషదాయకంబులగు. 'కష్టీఫలీ' యను నార్యోక్తి యేల వృథాయగు?

సీ॥ ఏ దినమ్మునఁ గోర్కె లీ ♦ డేరునంచు
నెప్పుడేనాఁడు మీ ముఖేందుబింబ
ముదయమందని యువ్విళు ♦ లూరుచుండఁ
గలువ లన నొప్పు, నా యొక్క ♦ కనులజంట!

నేతాజీ—ఇంతీ! పురుషుం డెట్లయినను శ్రమపడవలసినవాఁడేగదా! నా కేమియుఁ గారాగారవాసము కష్టమని తోఁచలేదు సుమీ! రాజకార్యధురంధరుండైన దూతకుఁ గష్టసుఖములు పాటింపఁదగినవా? మానప్రాణభంగములు రాకుండ గాపాడుకొనవలయును జేసికిఁ గృతఘ్నుండుఁ గాకుండవలయును, రాజభక్తి వీడకుండవలయును. 'నా విష్ణుః పృథివీపతేః' అనిగదా పెద్దలు చెప్పుదురు. ఈ యార్యోక్తిఁ బఠించువానికి నైహికాముష్మికయశఃప్రాప్తి గలుఁగును. అయినను నీవబల వగుటచే నిన్ని విషయము లెఱుంగవు. నీవు నాకై సహించిన మార్గాయాసక్లేశములే పాతివ్రత్యమును వెల్లడించుచున్నవి. లోకమున సతులెల్ల

నిన్నె తార్కాణముగాఁ గొని పతిభక్తిఁ గలిగి మెలంగెదరు గాక, కాంతామణీ!

ఉ॥ ఆకు మలంగు పిందెగ గృ ♦ హమ్మున నుండెను దానవయ్య్యో, నీ
వాఁకలి దప్పియుఁ రవి కి ♦ రాత్రియునోర్చి మృగేంద్రభల్లు కా
నీకయుతాటవి న్దిరుగ ♦ నేర్చితి, భర్తృవియోగ జాత చిం
తాకులితార్తచిత్తలకు ♦ నడ్డమె తక్కినబాధ లెవ్వియుఁ॥

కాశీ—నాథా! మీరంతగ నన్ను గొనియాడ వలయునా? పతిహిత చర్య యిట్టిదే కద! అందుచే నిట్లొనర్చితి.

భీమా—అమ్మా! కాశీ! నీ చరిత్ర మిక్కిలి పావనత నొందినది.

ఉ॥ ధన్యవునైతి, పూర్వసుకృ ♦ తప్రకరాప్తిని, స్త్రీవతంస మూ
ర్ధన్యవునైతి, సర్వవిబు ♦ ధ ప్రకరాంచిత బంధువర్గ స
న్మాన్యవునైతి, నిత్యసుజ ♦ న స్తవనీయ చరిత్ర నీ యసా
మాన్య పతివ్రతాచరిత ♦ మాంతమై తనరారు గావుతన్॥

అందఱును—తథాస్తు (అని యందురు)

శివాజీ—వీరశిఖావతంసమా! నేతాజీ! నీచరిత్ర లోకపావనకరంబయిన రాజభక్తినిఁ జాటి, ప్రజల ననుకూలురనొనర్చి రాజులతో సఖ్యమ్ము గలిగి మెలగుఁ హితబోధనొనర్చుగాత. రాజభక్తి యెల్లవారికిని ముఖ్యమని నీచరిత్ర విస్తరించుగాత.

గీ॥ రాజసేవాపరుండు నే ♦ తాజి ఘనుఁడు
ఖ్యాతితో నాత్మజాయా స ♦ మేతుఁడగుచు
సకల లోకాభివాంఛి తై ♦ శ్వర్యసంప
దాయురారోగ్యములచేత ♦ నలరుగాత.

వీరాగ్రేసరా! పతివ్రతాతిలకంబనుటకు నీ భార్యయే తార్కాణ మగు గాత.

అందఱు—(కరతాళ ధ్వనులొనర్తురు)

| | |
|---|---|
| భీమాజీ<br>వాణి | నేతాజీకిని కాశీబాయికిని (కుసుమమాలిక లర్పింతురు) |

అన ఘోర్దంపత్యోరభి వృద్ధిరస్తు.